

# FUTURE SHOCK

Bare legs and shoulders no longer raise eyebrows, and the dupatta has become dispensable. So, what is *Bharatiya Nari* going to COVER OR UNCOVER.

# మిసిమి

*"All that we are is the product of what we have thought," is "We are what we think."* – **Dammapada.**

సంపుటి 2 ఫిబ్రవరి 1992 సంచిక 31

విషయసూచిక



వార్షిక చందా రూ.40/-

Printed, Published and Edited by Shri ALAPATI RAVINDRANATH for and at Kala Jyothi - Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**
B-15, Journalist Colony, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Agitator,** *n.* A statesman who shakes the fruit trees of his neighbors-to dislodge the worms.

**Alderman,** *n.* An ingenious criminal who covers his secret thieving with a pretence of open marauding.

**Alliance,** *n.* In international politics, the union of two thieves who have their hands so deeply inserted in each other's pocket that they cannot separately plunder a third.

**Altar,** *n.* The place whereon the priest formerly raveled out the small intestine of the sacrificial victim for purposes of divination and cooked its flesh for the gods. The word is now seldom used, except with reference to the sacrifice of their liberty and peace by a male and a female fool.

**Ambition,** *n.* An overmastering desire to be vilified by enemies while living and made ridiculous by friends when dead.

**Amnesty,** *n.* The state's magnanimity to those offenders whom it would be too expensive to punish.

**Antipathy,** *n.* The sentiment inspired by one's friend's friend.

**Aphorism,** *n.* Predigested wisdom.

**Apologize,** *v.i.* To lay the foundation for a future offence.

**Appeal,** *v.t.* In law, to put the dice into the box for another throw.

**Archbishop,** *n.* An ecclesiastical dignitary one point holier than a bishop.

**Architect,** *n.* One who drafts a plan of your house, and plans a draft of your money.

**Arena,** *n.* In politics, an imaginary rat-pit in which the statesman wrestles with his record.

**Aristocracy,** *n.* Government by the best men. (In this sense the word is obsolete; so is that kind of government.) Fellows that wear downy hats and clean shirts-guilty of education and suspected of bank accounts.

**Arrest,** *v.t.* Formally to detain one accused of unusualness
God made the world in six days and was arrested on the seventh.
– *The Unauthorized Version.*

**Arsenic,** *n.* A kind of cosmetic greatly affected by the ladies, whom it greatly affects in turn.

# అంధకార యుగాల్లో వేగుచుక్కలు
# ఆగస్టిన్ - అక్వినాస్

- ఎన్. ఇన్నయ్య

చీకటి గదిలో లేని నల్ల పిల్లి కోసం వెదకడం వంటిదే తత్వ పరిశోధన అని ఎగతాళి చేసేవారున్నారు. అలాంటి తాత్విక రంగంలో వెయ్యేళ్ళు అంధకారం అలుముకున్నది. అంధకారమా? ఎక్కడుందో చూపితే నమ్ముతానన్నాడట ఒక తాత్వికుడు! క్రీ.శ. మొదలు 1300 ఏళ్ళ వరకూ యీ అంధకార యుగం వుండగా దాదాపు వెయ్యేళ్ళ తేడాతో ఇద్దరు తాత్వికులు వేగు చుక్కల వలె విరాజిల్లారు. ఒకరు ఆగస్టిన్, మరొకరు థామస్. ఆగస్టిన్‌కు ముందు, అరిస్టోటిల్ తరువాత గ్రీకు తత్వవేత్తలు ఎపిక్యూరస్ గొప్ప పదార్థ తత్వాన్ని పెంపొందించాడు. ప్లోటినస్, స్టాయిక్స్, యూదులు, రోమనులు, తమ తత్వాలను యథాశక్తి రూపొందించారు. వీటన్నిటికీ మతం బాగా పెనవేసుకుపోయింది. అలాగే ఆగస్టిన్ తత్వం కూడా మత నమ్మకాల మయమే.

యూరోప్‌లో క్రైస్తవ నిరంకుశ పాలన పెత్తనం చేస్తుండగా, స్వతంత్రంగా ఆలోచించే అవకాశం లేకుండా పోయింది. సందేహాన్ని సహించని రోజులవి. అలాంటప్పుడు ఉత్తర ఆఫ్రికాలో ఆగస్టిన్ మత పరిధిలోనే కొంత ఆలోచన చేశాడు. యూదుల ప్రాబల్యం తగ్గింది. క్రమేణా ముస్లింలు తలెత్తి, గ్రీకు, రోమ్ రచనల్ని అనువదించి యూరోప్‌కు అందించారు. విగ్రహారాధన వ్యతిరేకించారు. అద్భుతాల ప్రయోగం బూటకమన్నారు. ఇస్లాం చాలా త్వరగా వ్యాపించింది. క్రైస్తవ మతాలు ఒకవైపున తమ ఆధిపత్యం కోసం ప్రయత్నిస్తుండగా మరో పక్క ఇస్లాం దేశదేశాల్లో విస్తరించింది. యూనివర్శిటీ వ్యవస్థకు ఫ్రాన్స్ నాంది పలికింది. యూదుల నిరంకుశ మతవ్యవస్థకు ఎదురు తిరిగిన క్రైస్తవం క్రమేణా తానే నియంతగా మారింది. ఇస్లాం నుండి దాడిని ఎదుర్కోవలసి వచ్చింది. అలాంటి పరిస్థితిలో థామస్ అక్వినాస్ బయలుదేరి క్రైస్తవాన్ని కాపాడే ప్రయత్నం చేశాడు. సంస్థాగత క్రైస్తవాన్ని ఆగస్టిన్ ప్రశ్నిస్తే, అక్వినాస్ సమర్థించాడు.

అరిస్టోటల్ నుండి ఆగస్టిన్ వరకూ భావ వీధుల్లో విహరిస్తే మనకు గ్రీకుల గణితం, ఖగోళం, పైథాగరస్, యూక్లిడ్ రేఖాశాస్త్రం, ఆర్కిమిడిస్ కనిపిస్తాయి. గ్రీకులు అటు విజ్ఞాన రంగంలోనూ, ఇటు గణితంలోనూ గణనీయమైన ఆలోచనచేసి, ఉత్తరోత్తరా తరాల వారిపై ప్రభావం చూపెట్టారు. గ్రీకుల నగర నాగరికత అలెగ్జాండర్ దండ యాత్రలతో ఆసియాలో కూడా వ్యాపించింది. రాను రాను క్రైస్తవ మతం, అంతకు ముందే యూదులు తమ శక్తివంతమైన పరలోక భావాలను ప్రబలింపజేశారు. మరోప్రక్క నిరాశావాదులు, సందేహవాదులు, కొత్త ఆలోచనలు ప్రవేశపెట్టారు. అరిస్టోటల్ తరువాత వచ్చిన గొప్ప ఆలోచనా రీతిలో ఎపిక్యూరస్ తత్వం సేర్కొన దగింది. అప్పుడే స్టాయిజం కూడా వుంది. ప్లోటినస్ వచ్చి మార్మిక వాదాన్ని జొప్పించాడు.

గ్రీకుల సంస్కృతి, నాగరికత నుండి మనం కొంచెం ముందుకు సాగితే, రోమన్ ప్రపంచంలో అనేక మార్పులు చేర్పులు చూస్తాం. ఆగస్టస్ సామ్రాజ్యంలో శాంతి విలసిల్లగా, కళలు నాగరికత విస్తారడం గమనార్హం. ఫ్లూటార్క్ వంటి వారి రచనల ద్వారా మనకు ఎన్నో చరిత్ర లోతుపాతులు తెలిశాయి.

# ఎపిక్యూరస్

అరిస్టోటల్ అనంతరం తాత్విక చింతనా రంగాన్ని ఎపిక్యూరస్ అంతగా ప్రభావితం చేసి, విమర్శలకు గురైన ఆలోచనాపరుడు మరొకరు కనిపించరు. ''తిను, తాగు, సుఖించు'' అన్నాడని అతనిపై ప్రచారం చేశారు. అతడి రచనలు ఎన్నో నాశనం చేశారు. లూక్రిటస్ (Lucretius) పద్య రచన ద్వారా మనకు ఎపిక్యూరస్ సజీవంగా అర్థమౌతాడు. ఎపిక్యూరస్ మత నిరంకుశత్వాన్ని ఖండించాడు. మనిషికి ప్రాధాన్యత సమకూర్చాడు. స్వేచ్ఛను ప్రబోధించాడు. అయితే ఎపిక్యూరస్ తత్వాన్ని అవగాహన చేసుకోకుండా, సుఖంగా వుండు అనే మాటల్ని పట్టుకొని, తిట్టిన వారున్నారు. అదే భావాన్ని రోమన్లు ఆచరించారు కూడా.

జ్ఞానం వలన మానవుడు సుఖంగా వుంటాడనేది ఎపిక్యూరస్ మూలసూత్రం. గందరగోళం, అరాచకత్వం నుండి దేవుడు క్రమత్వాన్ని సృష్టించాడని పిల్లలకు చెబుతారు. అయితే గందరగోళాన్ని ఎవరు సృష్టించారు అని ఎపిక్యూరస్ అడిగాడు. సమాధానం లేదు.

విశ్వంలో మార్పు నిత్యం. వీటి కారణాలు తెలుసుకోవడం మానవ విజ్ఞాన పరిధిలోని ముఖ్యాంశం. దీనివలన భయం, ఆందోళన తొలగి, సంతోషం, సుఖం లభిస్తుందని ఎపిక్యూరస్ సిద్ధాంతం. ఇదే జీవిత లక్ష్యం అంటాడు. బాధ దోషపూరితమైతే, సుఖం సంతోషదాయకం అనేది ఎపిక్యూరస్ వాదం.

మనలో మూఢ నమ్మకాలున్నాయి. అవి తొలగించుకోడానికి జ్ఞానార్జన అవసరం. మత సంకెళ్ళ నుండి బయట పడటం కూడా మానవుడి కర్తవ్యం అని ఎపిక్యూరస్ బోధించాడు. మతం పేరిట ఏర్పరచిన బంధాలు తెంచుకుంటే మానవుడు మానసికంగా స్వేచ్ఛను అనుభవిస్తాడంటాడు. మనిషి పవిత్రంగా బ్రతకడానికి మతం, దేవుడు అక్కరలేదన్నాడు.

ఎపిక్యూరస్ అణుసిద్ధాంతం పేర్కొన్నాడు. ప్రపంచంలో ద్వంద్వ వాదాన్ని కాదన్నాడు. అణువుల సముదాయం వలన, పదార్థాలు ఏర్పడుతున్నాయి. శరీరంలో సున్నితమైన ఆత్మ వున్నదనీ, అది మనిషితో బాటే చనిపోతుందనీ చెప్పాడు.

ఎన్ని వక్ర భాష్యాలు నిందలకు గురైనా, చివరకు 17వ శతాబ్దంలో గసెండి (Gassendi) వచ్చి వాస్తవాల్ని బయటపెట్టి ఎపిక్యూరస్ తత్వానికి జీవం పోశాడు.

క్రీస్తు అనంతరం క్రైస్తవుల, యూదుల మతభావాలు ప్రబలి వుండేవి. మతం - రాజ్యపాలన, రాజకీయాలు కలసి పయనించాయి. బైబిల్ పాత నిబంధన యూదుల పవిత్ర గ్రంథం కాగా, అందులోని కొన్ని అంశాలు క్రైస్తవులు స్వీకరించి, తరువాత కొత్త నిబంధన చేర్చారు.

## యూదులు

యూదులు, క్రైస్తవులు కూడా మానవుడిని పాపాత్ముడుగా భావించారు. అతడికి మోక్షం సంప్రాప్తించాలంటే మార్గాలు చెప్పారు. అక్కడే మత నిరంకుశత్వం మానవుడి మనస్సును బానిసత్వంలో అట్టి పెట్టింది.

యూదులు వ్యవసాయంతో ఆరంభించి, వాణిజ్యంలోకి దిగి, మనుష్యుల్ని తమ వడ్డీ వ్యాపారంతో పీల్చి పిప్పి చేస్తున్నారనే పేరు ఆర్జించుకున్నారు. అది వారిని వదలలేదు. క్రైస్తవులు వారిని తరిమి కొట్టి హింసించారు. సాహిత్యం, సైన్సు, కళలు, నాగరికతలలో యూదుల రచనలు ఎంతో ప్రభావాన్ని చూపాయి. గ్రీక్, హీబ్రూ భాషలలోని సారాంశాన్ని, తాత్వికుల చింతనను యూరోప్‌లో క్రైస్తవులకు అందించడంలో యూదుల పాత్ర గణనీయ మైనది.

## క్రైస్తవులు

యూదుల నుండి చీలి, క్రైస్తవులు వచ్చారు. ఆగస్టిన్ వచ్చే నాటికీ క్రైస్తవ మత ప్రాబల్యం ప్రబలుతూ వచ్చింది. పాలనా రంగంలో కూడా క్రైస్తవ బిషప్పులు భాగం పంచుకున్నారు. దేవుని రాజ్యస్థాపన పేరిట కేథలిక్ ఆధిపత్యం వచ్చింది. క్రీస్తు ప్రతినిధిగా పోప్ పెత్తనం ఆరంభమైంది. అద్భుత శక్తుల్ని, పరలోకాన్ని నమ్మిన క్రైస్తవులు మానవుల పాప పరిహారార్థం అనేక మార్గాలు, ప్రార్థనలు సూచించారు. దేవుడికీ మానవుడికీ మధ్య పౌరోహిత్యం నిర్వహిస్తున్నామంటూ పెత్తనం సాగించారు. మత మార్పిడిని అనుసరించారు. ఎదిరించిన వారిని హింసించారు. అవసరమనుకుంటే యుద్ధాలు చేశారు.

తొలుత మతపరంగా క్రైస్తవులకు సిద్ధాంతాలు సమకూర్చిన వారు ఆంబ్రోస్, సెయింట్ జెరోమ్, పోప్ గ్రెగరీ కాగా, వీరిలో ఆగస్టిన్ మకుటాయమానమైన పాత్ర వహించాడు. బైబిల్‌కు జెరోమ్ భాష్యం ప్రమాణమైంది. స్త్రీలను క్రైస్తవులుగా మార్చాడు. ఎందరో స్త్రీలకు ఆయన రాసిన ఉత్తరాలు, పవిత్రత కాపాడుకోవాలనే హితబోధనలు లభించాయి.

అయితే సిద్ధాంత రీత్యా ఆగస్టిన్ ప్రాధాన్యత వీరెవరికీ రాలేదు.

అంధకారయుగం ఆరంభంలో ఆగస్టిన్ వుండగా అంతంలో అక్వినాస్ వున్నాడు. ఆగస్టిన్ ఏకాకి. ఆఫ్రికాలో పుట్టి అక్కడే పెరిగి, చాలా ప్రాంతాలు పర్యటించి, స్వస్థానంలోనే చనిపోయాడు. ఆగస్టిన్ రాసిన కన్ఫెషన్స్, ది సిటి ఆఫ్ గాడ్ క్రైస్తవ తత్వంలో గొప్ప పుస్తకాలుగా నేటికీ భావిస్తున్నారు.

ఆగస్టిన్ ఆఫ్రికాలోని నుమీడియా రాష్ట్రంలో 354లో పుట్టాడు. తల్లి క్రైస్తవ మతస్థురాలు కావడం వలన ఆమె ప్రభావంతో మిలన్‌లో కేథలిక్ అయ్యాడు. యువకుడుగా ఒక అమ్మాయిని ప్రేమించి, కొడుకును కని వారితోపాటు రోం వెళ్ళాడు. మిలన్‌లో ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. కాని తల్లి కారణంగా సంసారం వదలి, 396లో బిషప్ అయ్యాడు. 430లో చనిపోయేవరకూ హిప్పో బిషప్‌గా వుండిపోయాడు.

తాత్త్వికుడుగా బైబిల్‌ను ప్లేటో తత్వాన్ని సమన్వయీకరించాలని ఆగస్టిన్ ప్రయత్నించాడు. చిన్నప్పటి నుండీ పాపభీతి గల ఆగస్టిన్, అనవసరంగా పొరుగింటి ఫల వృక్షాన్ని పాడు చేశానని బాల్యం నుండీ బాధ పడ్డాడు. ఆకలి లేనప్పుడు, ఇంట్లో సమృద్ధిగా ఫలాలు వున్నప్పుడు, కేవలం తోటి పిల్లలతో కలసి, ఇరుగు పొరుగు వారి ఫలవృక్షాలు పాడుచేసిన పాపాన్ని క్షమించమని దైవాన్ని వేడుకున్నాడు. ఆ సంఘటన జీవితమంతా ఆగస్టిన్‌ను వెన్నాడింది. తన కన్ఫెషన్స్ గ్రంథంలో యిలాంటివెన్నో రాశాడు. 7 అధ్యాయాలు యిలాగే రాసిన ఆగస్టిన్ నేటివారికి అయోమయంగా, అమానుషంగా కనిపించినా, అప్పట్లో గొప్ప పవిత్రుడుగా పరిగణించబడ్డాడు.

ఆగస్టిన్ గ్రీక్ నేర్వలేదు. లాటిన్ మాత్రం బొపోశనం పట్టాడు. భాషా శాస్త్రం చదివి, జ్యోతిష్యం అధ్యయనం చేశాడు. కాని, రాను రాను జ్యోతిష్యంపై జుగుప్స కలిగింది. ఖగోళ శాస్త్రం బాగా అవగాహన చేసుకునే ప్రయత్నం చేశాడు. తనకు వచ్చిన సందేహాలు తీర్చుకోడానికి బిషప్ ఫాస్టస్ దగ్గరకు వెడితే ఆయనేమీ చెప్పలేకపోయాడు. రోం వెళ్ళి చదువుకున్నాడు. తరువాత మిలన్‌లో అంబ్రోజ్‌తో పరిచయం ఏర్పడింది. సందేహించడం మంచి లక్షణం అని రోంలో గ్రహించాడు.

క్రైస్తవంలో మనిషియన్స్ శాఖలో వున్న ఆగస్టిన్, వారి ద్వైతానికి భిన్నంగా ఆలోచించాడు. సెయింట్ పాల్ రచనల్లో సేద దేరాడు. బిషప్పుగా మారిన అనంతరం సందేహవాదులకు వ్యతిరేకమయ్యాడు. ఆగస్టిన్ ఎన్నో రచనలు చేశాడు. వాటి ప్రభావం చాలా శతాబ్దాలు క్రైస్తవులపై, కొంత పరిమితంగా తత్వంపై, మత జ్ఞానంపై వున్నది. ముక్తిమార్గం గురించి పెలాజియన్ అనే క్రైస్తవుడికి వ్యతిరేకంగా చాలా వాదించాడు. సిటీ ఆఫ్ గాడ్ అనే గ్రంథంలో చరిత్ర తత్వాన్ని విపులంగా రాశాడు. ఇదికాక, కాలాన్ని గురించి తాత్త్వికంగా సిద్ధాంతీకరించాడు.

తాత్త్వికుడుగా ఆగస్టిన్ తన కన్ఫెషన్స్‌లో 11వ సంపుటాన్ని రాశాడు. అంతకు ముందు 10 సంపుటాలు జీవితానుభవాలే. బైబిల్‌లో జరిగిన సృష్టిని ఆగస్టిన్ సమర్థించాడు. శూన్యం నుండి సృష్టి చేసిన భగవంతుడు, క్రమత్వాన్ని అమర్చాడన్నాడు. అయితే సృష్టి తొందరగా ఎందుకు జరగలేదనే సందేహానికి తావు లేదంటూ, తొందర అనేదే లేదని ఆగస్టిన్ భావించాడు. సృష్టితో పాటే కాలం కూడా వచ్చింది. దేవుడు కాలాతీతుడు. అతనిలో ముందు వెనకలు లేవు. కాల ప్రవాహంలో దైవం ఉండదు. కాలం అంటే ఏమిటో తనకు తెలియదని ఆగస్టిన్ అంటూ, వర్తమానం ఒక్కటే వున్నదని, అది సాగిపోతుంటే కొలుస్తామని చెప్పాడు. గతాన్ని జ్ఞాపకంగానూ, భవిష్యత్తును వూహించడంలోనూ, కాలం విషయమై కలిగే విరుద్ధాలను అధిగమిస్తామన్నాడు. ఈ కాలమనేది మనస్సులో వున్నదని, మనిషికి అతీతంగా కాలం లేదనీ ఆగస్టిన్ అనుకున్నాడు. ఆనాటికి ఆగస్టిన్ యీ మాత్రం కాలాన్ని గురించి ఆలోచించి, సిద్ధాంతీకరించడం విశేషంగా భావించాలి.

...లకూ రాజులకూ వచ్చిన కలహాలలో రోం నగరం విధ్వంసానికి గురైంది (410లో) ...లను వెనకేసుకొచ్చి 'ది సిటీ ఆఫ్ గాడ్' అనే గ్రంథాన్ని ఆగస్టిన్ రాస్తే, పది శతాబ్దాలపాటు ఆ రచన ప్రభావం యూరప్‌లో వుంది. రోం నగరాన్ని గోత్స్ నాశనం చేశారు. వారికి శిక్ష తప్పదు. కన్యల్ని చెరచారు. కాని కన్యత్వం దేహానికి చెందినదికాదని

ఆగస్టిన్ వాదించి, కన్యత్వం మనస్సుకు చెందినది గనుక మనస్సు పరిశుభ్రంగా వున్నంతవరకూ ఎవరూ చెరచలేరన్నాడు. అందువలన చెరచబడ్డామనే వారు, ఆత్మహత్యలు చేసుకోరాదని, ఆత్మహత్య పాపమని ఆగస్టిన్ నిర్ధారించాడు. అయితే చెరిచేటప్పుడు కన్యలు ఆనందించరాదని, అలా జరిగివుంటే పాపమనీ ఆయన విడమరచి చెప్పాడు. హెథెన్ దేవుళ్ళను ఖండించాడు.

జ్యోతిష్యాన్ని తీవ్రంగా నిరసించిన ఆగస్టిన్, కవలపిల్లల ఉదాహరణ చూపి, ఇరువురి జాతకాలు వేరుగా వుంటున్నాయన్నాడు. కాలజ్ఞానం గల దైవానికి మన పాపాలు తెలుసనీ, అయితే దైవానికి తెలుసు గనుక మనం పాపాలు చేయడం లేదని అన్నాడు. గ్రీకుతత్వవేత్తలలో ఒక్క ప్లేటోకు మాత్రమే ఆగస్టిన్ అత్యున్నత గౌరవం ఆపాదించాడు. వివేచనవలన తాత్వికులు విషయాలను కనుగొనవచ్చునన్నాడు. మతపరమైన సంగతులన్నింటికీ బైబిల్ మాత్రమే ప్రమాణం అన్నాడు.

లైంగిక విషయాలు చర్చిస్తూ, పిల్లల కోసం పెళ్ళి అయిన వారు లైంగిక సంబంధం పెట్టుకోవచ్చు, కాని కేవలానందం కొరకు కాదని ఆగస్టిన్ వాదించాడు.

విద్యావేత్తల సందేహాలను ఖండించిన ఆగస్టిన్, మతప్రమాణ గ్రంథాన్ని బైబిల్‌ను,నమ్మాల్సిందేనన్నాడు. సొంతంగా చెప్పింది అట్టే లేకపోయినా, మతాన్ని రాజ్యాన్ని వేరుగా చూడాలనే భావాలు అతడి రచనలో అంతర్లీనంగా వుంది.

ృలు చేసిన దారుణకృత్యాన్ని నేరాల్ని ఖండించకపోగా, బైబిల్ పేరిట ఆగస్టిన్ సమర్థించాడు. అవన్నీ క్రైస్తవ మతాధిపతులకు బాగా వినియోగించాయి. అంధకారయుగంలో మనుష్యుల్ని, ముఖ్యంగా క్రైస్తవేతరుల్ని కాల్చుకుతిన్నారు.

ఆగస్టిన్ అనంతరం అంధకార యుగం అనడానికి, చెప్పుకోదగిన తత్వం లేకపోవడం ఒక కారణం కాగా, యూరోప్‌లో ఆటవిక రాజ్యపాలన సాగడం మరో కారణం. గ్రీక్, రోం నాగరికతలు అంతమయ్యాయి. బైజాంటనులు, గోత్‌లు దండయాత్రలు చేశారు.
మతం నిరంకుశ రాజుల్ని సమర్థించింది. అయితే కొంతవరకైనా రోం నాగరికత మనకు తెలియడానికి క్రైస్తవ మతం తోడ్పడింది. పోప్ గ్రెగరీ కూడా అంధకార యుగంలో కొంతమేరకు చట్టాన్ని అమలు పరచాడు. క్రైస్తవ మతంలోకి ఆటవికుల్ని మార్చారు. విచిత్రమేమంటే ఆ తరువాత నాలుగు శతాబ్దాలపాటు క్రైస్తవ మతం ఇంకా దిగజారిపోయి, అంధకారంలో మగ్గిపోయింది. ఆరవ శతాబ్దం నుండి 10వ శతాబ్దం వరకూ యీ స్థితి కనబడింది. పోప్ బలపడి పాలించడం కూడా అప్పుడే. 9వ శతాబ్దంలో జాన్ దిస్కాట్ వంటి ప్రతిభాశాలి గ్రీక్ రచనల్ని అనువదించి అందించగా, 11వ శతాబ్దం నాటికి క్రైస్తవ మతాలలో సంస్కరణలు మొదలై, పునర్వికాసానికి నాంది పలికింది.

పన్నెండవ శతాబ్దానికి రాజులు, పోప్‌లు తమ ఆధిపత్యం కోసం పోరాటాలు ఆరంభించారు. క్రైస్తవులు మత యుద్ధాలు జరిపారు. అదే సమయంలో పండితులు బయలుదేరి గ్రీక్, రోం నాగరికత రచనల్ని అందించడమే గాక, కొత్త వాదనలు చేశారు. మత యుద్ధాల పేరిట క్రైస్తవులు పోపుల మద్దత్తుతో యూదుల్ని విపరీతంగా చంపారు. అప్పుడే కాన్ స్టాంట్

నోపిల్‌తో సంబంధం ఏర్పడగా, లాటిన్ రచనల్ని అనువదించారు. అరిస్టోటల్ తత్వాన్ని క్రైస్తవులు ఆమోదించారు. తర్కం ప్రబలంగా వచ్చింది. రోజలిన్, అబెలార్డ్ సెయింట్ బెర్నార్డ్ వంటి పండితులు మతవాదనల్ని వినిపించారు. ఆ తరువాత 13వ శతాబ్దంలో సెయింట్ ఫ్రాన్సిస్, మూడో ఇన్నోసెంట్, రెండో ఫ్రెడరిక్ వచ్చారు. ఇందులో థామస్ అక్వినాస్ పరాకాష్ఠకు చేరుకున్నాడు. ఆయన తత్వాన్ని గ్రహించే ముందు సంక్షిప్తంగా మహమ్మదీయుల పాత్ర అవగాహన చేసుకోవాలి.

## ముస్లింలు

మక్కా నుండి మదీనాకు మహమ్మద్ పలాయనం చేసిన 622 నుండీ హిజ్రా శకం ఆరంభమైంది. మహమ్మద్ ప్రభావం విపరీతంగా అతి వేగంగా వ్యాపించింది. అరబ్బులు తమ మెరుపు దాడులతో సిరియా, పరిష్యా, కాన్‌స్టాంట్ నోపిల్, ఈజిప్టు, కార్తేజ్, స్పెయిన్‌లను జయించారు. ఇండియాకు దండయాత్రలు మొదలుపెట్టారు. ఇటలీలో మాత్రం ఓటమి చూచారు. ఇస్లాం వ్యాప్తిని దండయాత్రల ద్వారా చేయడం వారి లక్ష్యం. ఖురాన్ వారి పవిత్ర గ్రంథం. ఏకేశ్వరాధన వారి లక్ష్యం. ప్రవక్త అనంతరం శక్తివంతుడైన ఖలీఫా ఆధ్వర్యాన ముస్లింలు అరబ్ సామ్రాజ్యాన్ని నిరంకుశ రాజరికంగా మార్చి, పాలించారు. మహమ్మద్ అల్లుడు అలీ 661 లో మరణించిన అనంతరం అరబ్బులలో చీలిక వచ్చింది. సున్నీలు మహమ్మద్‌ను అనుసరించారు. అలీ అనుచరుల్ని షియాలు అన్నారు. ఇప్పటికీ వారి మధ్య కలహాలు సాగుతునే వున్నాయి. బహు భార్యత్వాన్ని పాటించిన ముస్లింలు రాజకీయ, సామాజిక తీరులో బానిసత్వాన్ని, వంశ పారంపర్యతను అనుసరించారు.

అరబ్ తాత్వికులలో కిండి (KINDI), మహమ్మద్ ఇబన్ మూసా, ఉమర్ ఖయ్యాం ఫిరదౌసి, అవిసెన్నా, అవరోస్ సుప్రసిద్ధులు. అరబ్ తత్వంలో మౌలికమైన సొంత విధానం ఏదీ పెంపొందలేదు. వీరిదంతా భాష్యం. గ్రీక్, లాటిన్ తత్వాలను యూరోప్‌కు అందించడంలో, అట్టిపెట్టడంలో వీరి ప్రాత గణనీయమైంది.

అరిస్టోటల్ ప్రకృతికి భాష్యం చెప్పగా, ముస్లిం తాత్వికుడు అవరోస్ మాత్రం అరిస్టోటల్ అంటే ఏమిటో వివరించాడన్నాడు. విశ్వాసానికీ, వివేచనకూ తేడా ఏమిటో అతడు చూపాడు. గ్రీకుల నుండి నేర్చిన అల్ ఘజాలి మతం నుండి తృప్తి పొందలేక, పెత్తందారీ తనాన్ని నిరసించాడు. ఇంద్రియ జ్ఞానం వలననే ఖచ్చితంగా తెలుసుకుంటామన్నాడు. టాలమీ విశ్వ కేంద్రంగా భూమి వున్నదంటే, ముస్లిం జ్ఞాని అబూబకర్ అది సరికాదన్నాడు. ఖగోళం, గణితంలో ముస్లింలు దీర్ఘంగా ఆలోచించారు. అరబ్బులు విజ్ఞాన, వివేచనను పెంపొందించే అవకాశాన్ని మతపరంగా జారవిడుచుకున్నారు. అయితే యూరోప్ పండితులకు (గ్రీక్) రచనలు అందించి, పరిమితంగా పునర్వికాసానికి అరబ్బులు తోడ్పడ్డారు.

## థామస్

ఆగస్టిన్ తరువాత థామస్‌కు పూర్వం కొందరు చింతనాపరులు లేకపోలేదు. కాని మతాధిపతుల రాజ్యాధిపత్యం, నిరంకుశత్వం ముందు వారి ఆలోచనలు ఎందుకు పనికిరాలేదు. మరోపక్క ఎడారుల్లో పుట్టిన మహమ్మదీయ మతం ఆటవికంగా విజృంభించింది.

థామస్ అక్వినాస్ క్రైస్తవ తత్వవేత్తగా గొప్పవాడు. (1225-1274) కేథలిక్‌లకు ప్రామాణికుడు. 80 లక్షల మాటల్ని రాసిన థామస్ చాలా లోతుపాతులు గల ఆలోచనాపరుడు. శిష్యుల మధ్య వాదోపవాదాలు తీవ్ర స్థాయిలో జరిగినట్లు, గురువు చివరకు పరిష్కరించినట్లు రచనల్లో చూపేవాడు. ఈ పద్ధతి సమ్మాధియొలాజీలో చూడవచ్చు.

థామస్ అక్వినాస్ కాలానికి విశ్వవిద్యాలయాలు, వాటిలో నిర్దుష్టంగా పాఠ్యప్రణాళికలు, బోధన, క్రమశిక్షణ ఆరంభమయ్యాయి. థామస్ ద్వంద వ్యక్తిత్వాన్ని చూపి, తాత్వికుడుగా ఆలోచిస్తూ, మతపరంగా నమ్ముతూ రచనలు చేసాడు. తాత్వికంగా చూస్తే ప్రపంచం శాశ్వతంగా వుండొచ్చు. మతప్రమాణగ్రంథం ఆధారంగా దైవం దీనిని సృష్టించాడు. తాత్వికుడుగా సందేహవాది అనిపించినా మతం అతడిపై ఆధిపత్యం చూపింది. ఆన్ ది ఎటర్నిటి ఆఫ్ ది వరల్డ్ యిందుకు మచ్చుతునక.

క్రైస్తవేతరులనుద్దేశించి ది సమ్మ కాంట్ర జంటైల్స్ తాత్వికంగా రాశాడు. హేతుబద్ధంగా ఆలోచించినా దేవుడు వున్నాడనీ, ఆత్మ నిత్యమనీ, థామస్ అంటాడు. కేవలం క్రైస్తవుల కొరకే రాసిన సమ్మధియాలజీలో వాదనలన్నిటికే బైబిల్ ఆధారంగా చూడొచ్చునంటాడు.

బాహ్యప్రపంచము వుంది గదా. అందులో వస్తువులు ఒకచోట నుండి మరో చోటకు కదుల్తున్నాయి గదా. ఉనికిలోకి వస్తూపోతున్నాయి గదా. వాటితో మొదలు బెట్టి చూస్తే, అందరూ దైవం అని పిలిచేచోట తేలతాం అంటాడు థామస్. ఇవి విశ్వజనీన ఆధారాలు. ఇవిగాక, ఉనికిలో కేవలం దైవంతోనే ఆరంభమయ్యే వాదనలూ వున్నాయంటాడు. రోమన్ కేథలిక్‌లు అధికారికంగా థామస్ అక్వినాస్‌ను గౌరవించి, బోధించారు. ఇప్పుడిప్పుడే అతడి ప్రభావం సడలింది. అయినా కేథలిక్‌లు కాని వారు సైతం అతడి రచనల్లో ఇంకా ఆసక్తి కనబరుస్తున్నారు.

థామస్ విద్య అంతా ఇటలీలోని నేపిల్స్, కొలోన్, పారిస్‌లో పూర్తి అయింది. 1259 నుండే జీవితమంతా నేపిల్స్‌లో గడిపి, అరిస్టాటిల్ తత్వాన్ని బాగా మథించి, సమర్థించాడు. అరిస్టాటిల్ వ్యాఖ్యాన కర్త అయ్యాడు. ఆగస్టిన్ సమర్థించిన ప్లేటో తత్వాన్ని థామస్ నిరసించాడు. మహమ్మదీయ చింతనాపరులు పొరపాటుగా అరిస్టాటిల్‌ను అవగాహన చేసుకున్నారని థామస్ నచ్చ చెప్పాడు. 1259-64 మధ్య క్రైస్తవేతరులకు క్రైస్తవ సత్యాన్ని నచ్చచెప్పే రచన చేసాడు. క్రైస్తవుల కోసం రాసిన పుస్తకం కూడ ఆకర్షణీయ వాదనలతో కూడిందే. దేవుడు వున్నాడనడానికి అరిస్టాటిల్ వాదనల్ని బాగా వాడుకున్నాడు.

ప్రపంచంలో అన్నీ చలనంతో వున్నాయి. ఇవి ఎవరు చేసారు, ఎవరు కదిలిస్తున్నారు అని చూచుకుంటూ పోతే ఎక్కడోచోట ఆగిపోతాం. అదే దైవం. అది నిత్యం, శాశ్వతం, తొలి కారణం కూడా. అంతకుమించి వాదనలో వెనక్కుపోలేం. సంపూర్ణతతో కూడిన దైవం నుండి ఈ సృష్టి వచ్చింది. నేతివాదం ప్రకారం ఏది కాదో చెబుతాం. దేవుడంటే యిది కాదు, అది కాదంటాం. ఉనికి, చైతన్యం రెండు అతడిలో కలిసే వుంటాయి. దేవుడు అనిర్వచనీయం. దైవం మంచితనంతో వివేచనతో సంపూర్ణతతో వుంటుంది. సృష్టికి పూర్వమే అన్నిటి గురించి దైవానికి తెలుసు. దైవమే సత్యం. ఇలా చెప్పుకుంటూ పోతే అక్వినాస్‌కు చిక్కుప్రశ్నలు ఎదురయ్యాయి. దేవుడికి ప్రపంచంలో వున్న వస్తువులు, దోషాల

గురించి తెలుసా? తెలుసు అని అతడు సమర్థించవలసి వచ్చింది. పరస్పర విరుద్ధమైనవి దైవం సృష్టించడని కూడ అన్నాడు. మనిషిని కుక్కగా మార్చడం దైవశక్తిలో లేదు.

మనిషిలో ఆత్మ గురించి అక్వినాస్ విపులంగా రాశాడు. తొలి పాపం మానవుడికి ఎలా సంక్రమించింది. పాపం చేసేది ఆత్మ గదా. ఆత్మ మరొకరికి సంక్రమించకపోతే పాపం ఎలా వస్తుంది అనే దానికి అక్వినాస్ జవాబు చెప్పలేక సతమతమయ్యాడు. ఆత్మలు ఎవరికి వారిలోనే సృష్టి అవుతాయంటే, ఆదాం నుండి మనుషులకు పాపం ఎలా వచ్చిందో థామస్ వివరించలేకపోయాడు.

జ్యోతిష్యాన్ని థామస్ తృణీకరించాడు. విధి అనేది దైవాజ్ఞ మాత్రమే అని చెప్పిన థామస్, ప్రార్థనవలన ఉపయోగం వుంటుందనీ, అయితే దైవనిర్ణయం మారదనీ వాదించాడు. దైవం మారకపోతే ప్రార్థన ఎందుకో ఆయన చెప్పలేకపోయాడు. పిల్లల్ని కనడం అపరాదనీ, ఇది సహజ స్వభావానికి విరుద్ధమనే ఆయన చెప్పారు. బహు భార్యాత్వం వుండరాదన్నారు.

ఆగస్టిన్ వాదనలలో పాపం, ఎంపిక, విధి విషయాలతో థామస్ స్థూలంగా అంగీకరించారు. బైబిల్ ప్రవచనాలు చెప్పడానికి ఆచరించడానికి పాపంచేసిన పురోహితులకు అర్హత వున్నద న్నారు. ఆనాడు చాలామంది క్రైస్తవ పురోహితులు ఘోరాలు చేసిన దృష్ట్యా వారిని యిలా వెనకేసుక రావలసివచ్చిందన్న మాట.

మొత్తం మీద అరిస్టాటిల్ తత్వాన్ని క్రైస్తవ మతానికి అన్వయించి, సమర్థింప చేయడంలో థామస్ అక్వినాస్ కృతకృత్యుడయ్యాడు. పారిస్, ఆక్స్ ఫర్డ్ విశ్వవిద్యాలయాలు థామస్ తత్వాన్ని ఖండించాయి. క్రైస్తవులకు, క్రైస్తవేతరులకు థామస్ రాసిన పుస్తకాలలో అతడి ప్రజ్ఞ చాలా విపరీతాకర్షణకు గురైంది. వివేచనతో వాదించి, అదంతా దైవదత్తమని పేర్కొనడం థామస్ తెలివికి నిదర్శనం.

## స్వాతంత్ర్యం అంటే యేమిటి?

''అవసరాన్ని గూర్చిన చైతన్యమే స్వాతంత్ర్యం'' లేక ''అవసరాన్ని గుర్తించడమే స్వాతంత్ర్యం'' (Freedom is the appreciation of necessity), అనేది ఒక ప్రసిద్ధమైన మార్క్సిస్టు సూత్రం. దీనిద్వారా వ్యక్తి అవసరాలనుబట్టే స్వాతంత్ర్యం వుంటుందనిగానీ, వుండాలనిగానీ అర్థాలు లాగడం మార్క్సిజాన్ని అపహాస్యంపాలు చేయడమే. ఏ సమాజంలో అయినా ప్రభుత్వాలు వ్యక్తులకు యిచ్చే స్వాతంత్ర్యానికి గానీ, వ్యక్తులు కావాలని పోరాడే స్వాతంత్ర్యానికిగానీ ఈ నిర్వచనంతో యేమీ సంబంధం లేదు. ఈ నిర్వచనం సహాయంతో వ్యక్తిస్వాతంత్ర్య సమస్యను పరిష్కరింప పూనుకున్న మార్క్సిస్టు మిత్రులు పిడివాదంలోకి దిగి తమకే అర్థంకాని అయోమ యంలో పడిపోతుంటారు.

రాచమల్లు రామచంద్రారెడ్డి

(ఊహాజనితం)

# కవిరాజుతో మధురవాణి

- పురాణం సుబ్రహ్మణ్యశర్మ

చౌదరిగారు హోటల్లో టిఫెన్‌చేసి కాఫీ తాగి సిగరెట్టు పీలుస్తూ 'రాసుకో' అంటారు. పొప్రయిటరు చిరునవ్వు నవ్వి 'రాసుకున్నాలే' అంటాడు తృప్తిగా. నెలాఖరుకు ఒక్కసారిగా పైకం యిచ్చేవారు. చౌదరిగారూ, హోటలాయనా చిన్నప్పటి స్నేహితులు. ఏవో గొడవలొచ్చి యిద్దరూ మాట్లాడుకోరు. కాని చౌదరిగారు రాకపోతే పిచ్చెత్తినట్లు వుంటుంది హోటలాయనకు. అదీ వారి స్నేహం.

**రామస్వామి:** శంకరుని యంత వేదాంత శాస్త్రవేత్త
యనియెగా 'అహమ్ బ్రహ్మాస్మి' యనుచుఁ గాన
నాకు నేనె నమస్సులొనర్చుకొందు
నాది మధ్యాంత శూన్యుడనైతి ననుచు

**మధురవాణి:** బేష్ బేష్! మీకు మీరే నమస్కారం పెట్టుకున్నారు గనుక నమస్కారమండీ చౌదరిగారూ అనవలసిన ప్రమాదం తప్పింది. (నవ్వు) నమోన్నమః

**చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి:** బందరు నందు నాకుగల
పల్వురు శిష్యులు స్కూలుశిష్యులై
నం దగు శ్రద్ధతో నితడ
నారత మింటికిఁ గూడ వచ్చి అం
దందలి మర్మమున్ దెలియు
నాస్థగలాఁ డగుటన్ వరించె వీ
నిం దగురీతిమైఁ ద్రిపుర
నేనిని సాహితికైత తోడుతున్.

**మధురవాణి:** మీ ప్రియశిష్యుడ్ని నాకు పరిచయం చెయ్యడంకోసం తమరు స్వయంగా రావాలా? కబురంపితే నేనే వచ్చి తమ పాదాలచెంత వాలేదాన్నే.

**చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి:** ఈతడొకండె కాదు కవి
యీతని సోదరులెల్లఁ గైతలో
జాతురినొల్చు వారగుట
జన్మపువంశపు హక్కుగాని యీ
కైత బలాత్కృతిన్ గొనిన
కాంత యనం బని లేదు శిష్యతా
భూతియుగాదు కమ్మఁదనపుం
బసఁ బట్టి గ్రహింపుడీ కవుల్

మా రామస్వామి అదొకరకం. నిన్ను సరిగా గుర్తించి మర్యాద చేస్తాడో లేదో అని -

**మధురవాణి:** కిం కవీంద్ర ఘంటా పంచాననులకు సాష్టాంగ దండప్రమాణాలు. మిమ్మల్ని స్వయంగా వేరే మరొక్కమారు దర్శించుకుంటాను. ఉద్ధతుల మధ్య నిరుపేద కుండతరమె. సెలవిప్పిస్తారా? ఇద్దరితో వేగలేను.

**చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి:** తథాస్తు (అంతర్ధానం)

**రామస్వామి:** (చౌదరి పుస్తకం చదువుకుంటూ ఆమెవంక చూసి పలకరించడు. పుస్తకంలో తల దూర్చారు.)

**మధురవాణి:** (కవి రాజులతో) గురజాడ అప్పారావుగారి మధురవాణిని తమ దర్శనార్థం వచ్చాను.

**రామస్వామి:** (సిగరెట్ వేళ్ళమధ్య పెట్టి బాగా ఎగపీలుస్తూ) గ్రామ్య భాషలో రాశాడు కన్యాశుల్కం. అందులో బ్రాహ్మణ్యాన్ని ఏకి పారేశాడు (నవ్వు). నాకు వేశ్యలంటే పడదు.

**మధురవాణి:** నా వృత్తితో మీకేం పని? మీ భావాలు ఆధునికం, నవ్యం. మీ భాష గొడ్డు గ్రాంథికం. అటువంటి భాషలో వెలిగించారే కవిత్వం?

**రామస్వామి:** నాది పండితుల భాష. నేను పండితుండ్ని మరియు కవిరాజుని.

**మధురవాణి:** మీ సందేశం మీతోటి సమానులైన వారిలోకి వెళ్ళింది గాని, సామాన్య ప్రజలలోకి వెళ్ళలేదేమో ఆలోచించారా?

**రామస్వామి:** నింద్యగ్రామ్యం రాస్తే నన్ను కవిరాజనేవారా?

**మధురవాణి:** విశ్వనాథవారూ మీరూ ఒకే పంథాలో వున్నారు? ఒకటే తిక్క.

**రామస్వామి:** నా కతనితో సాపత్యమేమి? నా తిక్క నాది.

**మధురవాణి:** తమ భావాలకు సూటుకాని భాషలో రాశారు పండితులిద్దరూ. ముఖ్యంగా గ్రాంథికం మూల పడుతున్న దశలో మీరు, హేతువాద సూర్యులు అందులోకి వెళ్ళి యిరుక్కుపోయారు (నవ్వు).

**రామస్వామి:** గ్రామ్యభాషలో రాయనందుకు నన్ను తప్పుబడుతున్నారా?

తెలుగు బిడ్డా మరచిపోకుర
తెలుగు దేశము పురిటి గడ్డర
కొక్కోరోకో పాట బాడర
తెలుగు వారల మేలుకొలపర – యిందులో యిబ్బంది ఎక్కడుంది నీకు?

**మధురవాణి:** స్వామీ! మీ కాలానికి మీరు చాలాముందు వుండి భావాలు వెదజల్లారు, అదీ మరుగున పడిపోతున్న గ్రాంథికంలో.

**రామస్వామి:** దాన్లేముంది? ఇదిచూడు –

వీరగంధము తెచ్చినారము వీరుడెవ్వడొ తెల్పుడీ
పూసిపోదుము మెడను వైతుము పూలదండలు భక్తితో

**మధురవాణి:** చాలా గొప్పగేయం, ఒప్పుకుంటాను (నవ్వు).

**రామస్వామి:** నవ్వుతారు దేనికి?

**మధురవాణి:** మీ గీతం గిరీశం గారికి చూపిస్తే ఇందులో రామప్పంతులు లాజిక్కు వుందన్నాడు. అది గుర్తుకొచ్చి నవ్వాను. అంతే –

**రామస్వామి:** ఏవిటా రామప్పంతులు లాజిక్కు?

**మధురవాణి:** వీరగంధంలో గూడా కులాల పిచ్చి వుందా?

**రామస్వామి:** వీరులు కులాతీతులు

**మధురవాణి:** మీరు పైకులాలు పెత్తనం చెలాయించాయనిమూమెంటు లేపారు. మీరుకూడా మీకింది కులాలపై పెత్తనం చెయ్యటం లేదా?

**రామస్వామి:** వాళ్ళూ ఎదురు తిరిగే రోజులు దగ్గరలో వుండవచ్చు.

**మధురవాణి:** యీ కులపిచ్చి కుదిరేదేనా? దీనికంతం లేదా?

**రామస్వామి:** బహుశా యిది రాజకీయాల్లో జొరపడి అల్లకల్లోలం సృష్టించవచ్చు. అంటే యింతవరకూ వీరగంధం ఎవరికీ పూయలేదంటావు?

**మధురవాణి:** స్వామీ! నే ననలేదు. ఆపాట అలా వుంది.

**రామస్వామి:** భలే దెబ్బ కొట్టావే (నవ్వు).

**మధురవాణి:** లేదు. మీరే గెలిచారు. మీరువచ్చి హేతువాద ఖడ్గం ఝళిపించేదాకా భూసురుల అగ్రవర్ణపు అధికారాన్ని అడ్డుకొన్న నాథుడేడీ? కరటకశాస్త్రి తన సొంతపను లకు డిప్టీ కలక్టరుగారి దగ్గరకు పంపితే చచ్చినట్లు వెళ్ళాను కానా? గిరీశం నన్ను డిప్టీ కలక్టరుగారి పుత్రరత్నానికి తార్చితే వెళ్ళాను కానా? మాకందరికీ ప్రశ్నించడం నేర్పింది మీరే! మీరే! మీరే!

**రామస్వామి:** లోకులు దిట్టిన నిజమే

వాకొనగా గట్టిపట్టు బట్టినవాడన్
లోకుల యిష్టానిష్టము
లా! కవిలోకంబు కలము నాకట్టంగన్.

**మధురవాణి:** మీ అహంకారం గురించి మీరు బాగా చెప్పుకున్నారు. అజ్ఞానమన్నా వుండాలి, అహంకారమన్నా వుండాలి కొందరు కొన్ని పుస్తకాలు రాయడానికి.

**రామస్వామి:** అతిశయ భక్తిన వినుమా
ప్రతిభాషింపకయె తెల్గుబాస కుమారా!
అతి మధురం బతిపేశల
మతి పేయముకాదె బాసలన్నిటిలోనన్.

**మధురవాణి:** మీకు సంస్కృతం అంటే ఏవన్నా చిరాకా?

**రామస్వామి:** నో!

ఒక్కభాష ప్రియమ్ము నొండొక్కభాష
విప్రియమ్ము నాకనుమాట వెగటు మాట
యయిన నే సొక్కుచుండెద నాంధ్రభాష
యతి మనోహర మగుటచే నాలకించి.

**మధురవాణి:** మీ కవిత్వం అంటే పద్యాలు సాటి అబ్రాహ్మణ కవులు మెచ్చుకున్నదానికంటె ఏ వెంకట శాస్త్రిగారో, విశ్వనాథవారో అట్లాంటి వారు మెచ్చుకుంటే ఎక్కువ సంతోషించేవారట కదా!

**రామస్వామి:** ఎవరు చెప్పారిటువంటివన్నీ నీకు?

**మధురవాణి:** చీకటి గదులు అనే నవలలో గోపీచంద్ వ్రాసాడు.

**రామస్వామి:** మనకంటే తక్కువవాళ్ళు మెచ్చుకుంటే మనకేమానందం? మన ప్రత్యర్థులు గాని, శత్రువులుగాని మన్ని మెచ్చుకోవాలి.

**మధురవాణి:** బాగున్నాయ్ గొంతెమ్మకోరికలు. మీరందరినీ తిట్టారు కాని, మిమ్మల్ని వాళ్ళు మెచ్చుకుని మేకతోలు కప్పాలి (నవ్వు).

**రామస్వామి:** అలా అన్లేదు నేను. ఎక్కడ నాకు అర్హతవుందో అక్కడ నన్ను గుర్తిస్తే సంతోషిస్తాను నేను.

**మధురవాణి:** మీ పురాణవైరం నిర్హేతుకం, సిల్లీ అంటున్నాను. బ్రాహ్మలు, ద్రావిడులు, ఆర్యులు అంటూ లేవదీసిన తగూలు వట్టి కల్పనలు. రాక్షసులు ద్రావిడులు కారు పొమ్మంటున్నారు కొత్త చరిత్రకారులు.

**రామస్వామి:** నీ పాండిత్యం ఎవరిక్కావాలి? నా పురాణవైరం గురించి చెబుతాను విను -

బూతు పురాణము గాదిది
పాత పురాణమును గాదు పాతకహరమౌ
సూతపురాణం బియ్యది
పూత పురాణంబు పుణ్య పురుషావళికిన్

రాముడు ఆర్యుడు. రావణుడు ద్రావిడ బ్రాహ్మణుడు. శూర్పణఖ రాక్షసి అంటే ద్రావిడ స్త్రీ. ఇదంతా కాదంటే ఎలాగ?

**మధురవాణి:** రాముడు ధర్మ ప్రభువు. శూర్పణఖకు ముక్కూ, చెవులు కత్తిరించారంటే అటువంటి నేరాలకు అలాటి శిక్షలుండేవి ఆకాలంలో. మీరు ఇంగ్లండు వెళ్ళొచ్చి ఆ దృష్టితో మాట్లాడ్డం తప్పుకాదా? వెనక దృష్టి లేదు.

**రామస్వామి:** నేనెవర్నో తెలుసా? రాముడికి స్వామిని. అంటే రాముడికి మొగుడ్ని ఏమనుకుంటున్నావో?

**మధురవాణి:** ప్రజాస్వామిక సూత్రాలు ఆనాడు లేవు స్వామీ. మనుషులంతా సమానం అని ఎవరన్నారు? చాతుర్వర్ణాలూ ఒకటి కాదు. శూద్రుడు తపస్సు చేయడం

తప్పని మరణదండన విధించారంటే - ఆ కాలంలో శూద్రుడు చెయ్యవలసిన విద్యుక్త ధర్మం ఎవరు చేస్తారు?

**రామస్వామి:** అయితే శ్రీరాముడు శంబుకుడ్ని వధించటం రైటంటావు?

**మధురవాణి:** రైటూ, రాంగూ అంటూ మాట్లాడుతున్నారు మీరు ఇంగ్లండులో చదివివచ్చి. రామాయణ కాలం త్రేతాయుగం. అంటే కొన్ని లక్షల సంవత్సరాల క్రితం లేదా వందల, వేల సంవత్సరాల క్రితం రాజనీతి, పరిపాలనాక్రమం అలా వున్నాయన్నమాట.

**రామస్వామి:** చెట్టు చాటునుంచి వాలిని చంపడం సబబేనంటావు. సీతకు అగ్నిపరీక్ష రైటే. ఆవిడ్ని అనుమానించి అడవికి తోలెయ్యడం రైటే. శంబుకుడ్ని చంపడమూ రైటే - అయితే యిక నీతో వాదించడానికి ఏముంది?

**మధురవాణి:** చౌదరీగారు అలా హీటెక్కిపోగూడదు. ఆనాటి పరిస్థితులు, దండనీతి, న్యాయం అలావుండేవి. కాని మీరనుకున్నట్లు ఆల్ మెన్ ఆర్ ఈక్వల్ అన్నట్లు వుండేవికావు. రాముడ్ని రాజుగా చూడకుండా మీరుకూడా దేవుళ్ళా చూసి కంగుతిన్నారు. అది వక్రంగా వున్నా అన్యాయంగా కనిపించినా అది అంతే.

**రామస్వామి:** నువ్వు నన్ను Confuse చేస్తున్నావు.

**మధురవాణి:** మీరు జస్టిస్ పార్టీలోకి ఎందుకు దూకారు, అంత దేశాభిమానం, దేశభక్తి వున్నవారు.

**రామస్వామి:** ఈ బ్రాహ్మల డామినేషన్‌ను ఎదుర్కొనడం, వాళ్ళ హ్యూమిలియేషన్‌ను ప్రతిఘటించడం ప్రధాన సమస్య అయింది అప్పట్లో.

**మధురవాణి:** బ్రాహ్మల డామినేషన్ సంగతి నిజమే కాని తెల్లవాళ్లు ఆ బ్రాహ్మణ భూతాన్ని చూపించి జస్టిస్ పార్టీలోకి మీ బోంట్లను చేరదీసి, స్వాతంత్రోద్యమాన్ని నీళ్ళుకార్పించాలని చూశారు. అన్ని జాతులూ కలవకుండా విభజించి పాలించు అన్న నీతికి మీరు లొంగిపోయారు. అవునా?

**రామస్వామి:** అది మా ఆత్మగౌరవానికి సంబంధించిన ఉద్యమం కనుక జస్టిస్ పార్టీలో చేరా. జస్టిస్ పార్టీవాళ్లు మాంట్‌ఫర్డ్ సంస్కరణల విధానాన్ని సమర్థిస్తే నేను వాళ్ళతో కలవలేదు వ్యతిరేకించా. జాతీయవాదుల డిమాండ్లకు అంటే అధికారం జాతీయ వాదులకి రావాలని సమర్థించా.

**మధురవాణి:** అబ్రాహ్మణ జాతీయవాదుల సమావేశానికి విజయవాడలో 1917-18లలో అధ్యక్షత వహించారట గదా? అంటే బ్రాహ్మణులతో కలసి స్వాతంత్ర్యం పంచుకోవడానికి యిష్టం లేకే కదా!

**రామస్వామి:** అప్పటి వ్యవహారాలని యిప్పుడు యీ దృక్పథంతో చూస్తే అవకతవకగా కనిపించవచ్చు నీలాటి వారికి. బ్రాహ్మణేతరోద్యమం అనేది ఓటి ప్రబలంగా వుంది. దాన్ని ఒప్పుకోవాలి. దాన్ని నేను సపోర్టుచేశాను ఆత్మగౌరవానికి

సంబంధించిన ఉద్యమం గనక. తరవాత జాతీయోద్యమం వచ్చింది. దాంట్లో కూడా స్వపరిపాలనకోసం జస్టిస్ పార్టీని వ్యతిరేకించా? ఇది ఆనాటి పరిస్థితి.

**మధురవాణి:** మీలో కొందరు - మీరు కాదనుకోండి - స్వాతంత్ర్యం వస్తే మళ్ళీ బ్రాహ్మణాధిక్యతలోకి పరిపాలన పోతుంది. ఎలాగూ బ్రాహ్మణులక్రింద పనిచేయడంకంటే బ్రిటిష్‌వాళ్ళ క్రిందే పనిచేయడం మంచిది అని స్వాతంత్రోద్యమాన్ని చులకనగా చూశారట. నిజమా?

**రామస్వామి:** లేదు. ఆరోజుల్లోనే మేం స్వకుల పౌరోహిత్యం ఆరంభించాం. జంధ్యాలు వేసుకుని సంధ్యావందన వార్చాం. బ్రాహ్మలకన్నా నిష్ఠగా మేమూ వున్నాం. నేను పెద్దరికం వహించి ఎన్నో పెళ్ళిళ్ళు చేయించాను.

**మధురవాణి:** అయ్యో! పిచ్చి చౌదరిగారూ బ్రాహ్మణత్వాన్ని వద్దంటూ బ్రాహ్మణ ఆచారల్నీ, పద్ధతుల్ని మీరు అనుసరించడంవలన బ్రాహ్మణుల గొప్పదనాన్ని మీరు ఒప్పుకున్నట్లు కాలేదా?

**రామస్వామి:** అలా చూడకూడదు. సాంస్కృతికంగాను, విద్యాపరంగాను, నియమ నిష్ఠల్లోను ఎవరికీ తీసిపోము అని రుజువు చేశాము. నీవన్నట్లు వెక్కిరించాలనుకుంటే వెక్కిరించవచ్చు. నా విరోధంకూడా బ్రాహ్మణత్వంతోకాని బ్రాహ్మణులతో కాదు.

**మధురవాణి:** ఇది తప్పించుకునేవాళ్ళు చెప్పేమాట. బ్రాహ్మడు లేకుండా బ్రాహ్మణత్వం అని వేరే వుంటుందా? (నవ్వు).

**రామస్వామి:** అందుకే తరువాత నాస్తికుడ్నయ్యాను.

**మధురవాణి:** ఇహ మీరు నాస్తికులయితే మీ పోరాటం అంతా పోయినట్లే - దేవుడ్ని అంగీకరించని వారికి పురాణాలతో ఏం పని? పైగా ప్రపంచమంతటా వున్న పురాణ సంస్కృతిని మీరు బ్రాహ్మణాధిక్యత నెపంతో ఎలా తిరస్కరించగలరు?

**రామస్వామి:** మన పురాణాలన్నీ బ్రాహ్మణాధిక్యతతో రాసిన పుక్కిటి గాథలంటున్నాను.

**మధురవాణి:** మీరు ఏవన్నా మీ సంస్కారం వ్యక్తిత్వం యీ శతాబ్దానిది. పురాణ కాలాన్ని కొలవడానికి మంచి చెడ్డలు నిర్ణయించడానికి అది బొత్తిగా పనికిరాదు. వేల వందల సంవత్సరాల క్రితం చరిత్రను మీరెలా నిర్దేశిస్తారు? మీదంతా డబాయింపు సెక్షను. లేకపోతే తిట్టడం? శేషం కోపేన పూరయేత్.

**రామస్వామి:** అన్యాయంగా మాట్లాడుతున్నావు మధురవాణీ. నా వ్యక్తిగత కక్షతో నేనిదంతా తిరిగి వ్రాయలేదు. ఇది యిలాకూడా జరిగి వుండవచ్చునన్న అభిప్రాయంతో నమ్మకంతోనే వ్రాశా. మొండిగా నమ్మా.

**మధురవాణి:** సెటైర్‌గా మీరేం చెప్పినా పవర్‌ఫుల్‌గా వుంటుంది. కాని మీరు చెప్పిందంతా మీరూ నమ్మేసరికి చౌదరిగారింత అమాయకులా అని జాలి వస్తుంది స్వామీ.

**రామస్వామి:** మలమల మాడు పొట్ట తెగ
మాసిన బట్ట కలంత వెట్టగా

విలవిల యేడ్చుచున్న నిరు
పేదకు జాలిని జూపకుండ ను
త్తలిపడి పోయి జీవరహితం
బగు బొమ్మకు నిండ్లు వాకిళుల్
పొలమును బొట్టనిచ్చెడి
ప్రబుద్ధ వదాన్యులు నిచ్చమెచ్చెదన్ - అనిన్నీ "ఏడో, పద్నాలుగో, మూడో, ఎన్నొ జగముల సృష్టించు యీశుడొకడో, యిర్వురో" మరెంత మందో వారిని కనుగొనలేక, "భక్తకోటికి ప్రాణాలపైకి" వచ్చినదనియు, "ఇందుగల డందులేడని సందేహము" లేనివానికి, అందుగల డిందుగలడని తీర్థయాత్రలు చేయుట "భగవదపచారములు గావె పరమ పురుష" అనియు "గుడికి తరచుబోయి గొణుగుచుండెడి వాడు చెడ్డ పాపమేదొ చేసియుండు" నని నామతం!

**మధురవాణి:** ఇస్లాములో మీవంటి హేతువాద సూర్యుడు ఉదయిస్తే యిట్టే ఆర్పేసేవారు హోయ్ అల్లా అంటూ.

**రామస్వామి:** అందుకే వాళ్ళింకా అట్లా వున్నారు వెనకబడి.

**మధురవాణి:** అబ్రాహ్మణ ఉద్యమాలు ఆత్మగౌరవం ఉద్యమాలు వీట్లన్నిటిలో పనిచేస్తూ కూడా మీరు ఒక్క కులం అభ్యున్నతికోసమే పాటుపడ్డారని మీమీదో అపవాదు వుంది. దానికి మీరేమంటారు?

**రామస్వామి:** నాకులం మటుకు దేశంలో భాగం కాదా - అది అలానే మొదలయింది. ఎక్కడ పుండు వుందో అక్కడ కడిగి కట్టువేసి మందేస్తారు. మొదట్లో సంఘసంస్కరణ, విద్యాభివృద్ధి, ఆత్మగౌరవం యివన్నీ బ్రాహ్మణత్వ అహంకారానికి ప్రతిగా వచ్చినవే. తప్పులేదంటాను. ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌లోంచి వచ్చినవే.

**మధురవాణి:** తప్పొ రైటూ కాదు గురువుగారూ. అవి మీ ఇమేజిని క్రుంగదీశాయి. మీరు జాతీయ నాయకులుగా జాతినంతా రిప్రజంటు చెయ్యలేదు. కులరహితంగా పోవాల్సింది అబ్రాహ్మణ ఉద్యమంలో కూరుకుపోయారు నిలువునా.

**రామస్వామి:** నువ్వు ఎన్నిమార్లు దెప్పినా ఒక్కటే సమాధానం. అప్పటి పరిస్థితులు అలా లాగేశాయి నన్ను.

**మధురవాణి:** జస్టిస్‌పార్టీలోని మీవారు కాంగ్రెసులోని మీవారికోసం తాపత్రయం పడ్డారు అవునా?

**రామస్వామి:** స్వకులాభ్యున్నతి ద్వారా సాంఘిక సంస్కరణ సాధించటం యిప్పుడు నింద్యమే; అప్పుడు తప్పుకాదు. నేను జాతీయోద్యమంలో నా ఉత్సాహాన్ని చంపుకోకుండా జస్టిస్‌పార్టీలో మావాళ్ళకు ఆశీస్సులందచేసిన మాట నిజమే. రెండు పడవలమీద ప్రయాణం చెయ్యలేదు.

**మధురవాణి:** ఇన్నయ్యకి ఆచార్య రంగాగారు వ్రాసిన ఉత్తరంలో మీరు కులపిచ్చిలో కూరుకుపోలేదనీ, 'వీరగంధం తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ' అన్న పాట ఒక్కటి చాలు జాతీయ నాయకులలో మిమ్మల్ని ముందుసీటున నిలపడానికి అన్నారు తెలుసా?

**రామస్వామి:** ఏ రంగయ్య నాకు యోగ్యతాపత్రం యివ్వక్కర్లేదు. నేను నేనే. నామంచి, చెడ్డలు అన్నీ నావే. నా పురాణవైరం అంతా సనాతనాచారాల ఊబిలోంచి మనవాళ్ళను పైకిలాగడానికే. తెలిసే చేశానంటున్నా.

**మధురవాణి:** ఐరిష్ దేశభక్తుడు డీవెలా మీ ఫ్రండటగదా!

**రామస్వామి:** అవును, రంగయ్య నాసాయం అడిగాడు. 'కమ్మపత్రికను' రైతు పత్రికగామార్చి - కమ్మవారితోపాటు రెడ్లు, తెలగాలు, రాజులు, కొందరు పంచములుకూడా రైతుల్లో వుండేవారు - రైతాంగం సమస్యలను ప్రభుత్వ పీడనను బ్రిటిష్ సర్కారువారి దృష్టికి తేవడానికి ఉపయోగపడింది. దానికి నేనే ఎడిటర్ని.

**మధురవాణి:** కమ్మవారిని యితర కులాలతో చేర్చి జాతీయ ముఖ్యస్రవంతిలో కలపడానికి చేసిన ప్రయత్నాల్ని మీవాళ్ళు అడ్డుకోలేదా?

**రామస్వామి:** అది సహజం. అడ్డుకుంటే నేనువారిని అడ్డుకుని తెగేసి చెప్పాను అందరం కలిశాక ముందునకు పోదాం అని. రంగయ్య రైతుపత్రిక్కి ఇంగ్లీషు లేబర్ గురించి, సామ్యవాద భావాలగురించి అక్కడి పరిస్థితుల గురించి వ్రాసేవాడు. రంగయ్యకి కమ్మవారితో పేచీలొస్తే నేను అడ్డుపడేవాడ్ని.

**మధురవాణి:** మా గురువు గురజాడ అప్పారావుకి వెయ్యలేదుకాని మీకు పోస్టలు స్టాంపు వేశారు. (నవ్వి) ఆ గౌరవం మీకు దక్కింది.

**రామస్వామి:** (ముసి ముసి నవ్వులు నవ్వుతాడు.)

**మధురవాణి:** మీ లక్షణాలన్నీ ప్రతి తెలుగువాడిలో వున్నాయి. మీరు నూటికి నూరుపాళ్ళు తెలుగుబిడ్డ. అయినా మిమ్మల్ని ద్వేషించడం తేలిక, ప్రేమించడం కష్టం (నవ్వు).

(మిగతా వచ్చే సంచికలో)

## 'శంబుక వధ'

శంబూకుడొక శూద్ర తపస్వి. ఈతని వృత్తాంతము కొంత భవభూతి మహాకవి వ్రాసిన ఉత్తరరామచరిత్రలో గన్పించును. ఈతడు స్వధర్మమైన త్రైవర్ణికదాస్యమును విడిచి పరధర్మమైన తపస్సులో మునిగెననియు తపస్సు చేయుటకు శూద్రులకధికారమే లేదనియు, అధికారము లేని ఇట్టి యాచారము లట్టివాండ్రు పాటించుటవలన బ్రాహ్మణజాతికి అమంగళము మట్టుకొనుననియు దానివలన లోకమునకే అరిష్టము దాపరించుననియు-అప్పటి పెద్దలు నిర్ణయించి శ్రీరామునకు జెప్పిరి. ఆతడా నిర్ణయమునకు అంతరాత్మలో బాధపడియు, అప్పటికే సీతను అడవులకు వెడలగొట్టి స్తిమితము లేక కుందియు గూలియు, మోమోటమికి లొంగి శంబూకమహర్షిని జంపి వచ్చెను.

— కవిరాజు త్రిపురనేని

# వీరేశలింగంపై విద్వేషం ఎందుకు?

– డా. అక్కిరాజు రమాపతిరావు

కందుకూరి వీరేశలింగం ఆధునికాంధ్ర దేశానికి సమాజపరంగానూ, సాహిత్యరంగం లోనూ కలిగించిన చైతన్యం ఎటువంటిదో, ఆయన చేసిన దేశసేవ ఎటువంటిదో లోకాని కంతా తెలుసు. విజ్ఞులకు మళ్ళీ మళ్ళీ విన్పించాల్సిన పనిలేదు. త్రికరణ శుద్ధికల మహాపురుషు డాయన అని ఆయన సమకాలికులు కూడా స్తుతించి ఉన్నారు. అనంతర కాలికుల కాయనపట్ల ఆరాధ్యభావం ఉన్నది. అదంతా ఇప్పుడు చర్విత చర్వణం చేయాల్సిన అక్కరలేదు.

'మిసిమి'లో ప్రచురితమైన 'వీరేశలింగంపంతులుతో మధురవాణి' అనే ఒక హాస్య రచనలో, ఊహాచిత్రణలో మధురవాణి ఆయన నిప్పులాంటి శీలాన్ని, పవిత్రవర్తనను మెచ్చుకోవడం కొందరు పెద్దలకు శోచనీయంగా కనిపించడం ఆశ్చర్యకరం. వీరేశలింగాన్ని గూర్చి సత్యాసత్యాలు సరిగా తెలుసుకోకుండా ఆయన శీలానికి కళంకం ఆపాదించే అభిప్రాయాలను ఆసక్తితో, ఉబలాటంతో ప్రచారం చేయడం, నమ్మడం అంతకన్నా శోచ నీయం. అసలు విషయం ఇదమిత్థంగా తెలుసుకోవాలన్న జిజ్ఞాస ఉంటే, కుతూహలం ఉంటే అందుకు సంబంధించి వచ్చిన వాద వివాదాలను గూర్చి, ఆయన సమకాలీనులు రాసిన గ్రంథాలను, కనీసం వీరేశలింగం, టంగుటూరి ప్రకాశం, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, రాయసం వెంకటశివుడు రాసిన స్వీయ చరిత్రలైనా చదవాలికదా! ఇంతే కాదు వీరేశలింగం పంతులు గారి జీవితానికి వ్యభిచారదోషం ఆపాదిస్తున్న కొందరి విపరీతపు రాతలను ఖండిస్తూ అ. రమాపతిరావు అనే నేను ప్రకటించిన 'యుగకర్త వీరేశలింగంపై నీలాపనిందలు' (జయంతి పబ్లికేషన్స్-విజయవాడ), సాహితీ యుగకర్త, నవ్యభావ వైతాళికుడు వీరేశలింగంపై అపవా దాలు - అభియోగాలు (స్త్రీ చైతన్య మండలి - హైదరాబాదు) అనే గ్రంథాలైనా చదవాలికదా.

చాలా కాలం కిందట వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రిగారు టంగుటూరి ప్రకాశం గారిపై ఒక జేబుసైజు పుస్తకం రాస్తూ వీరేశలింగాన్ని ఆధునిక బృహస్పతి అనీ, ఆయన గ్రంథచౌర్యం చేశాడనీ రాశారు. ఆయనకు ప్రకాశంగారి తమ్ముడు టంగుటూరి శ్రీరాములు ప్రోత్సాహకు డనే వైనం తెలిసిపోతూనే ఉన్నది. సదరు శాస్త్రులవారి షష్టిపూర్తి సంచికలో టంగుటూరి శ్రీరాములుగారు తన దగ్గరున్న రికార్డంతా ప్రచురించారు కూడాను!

'స్వర్గంలో వీరేశలింగం' అని వినోదకరంగా ఎవరైనా రచన చేస్తే అబ్బెబ్బే వీరేశలింగానికి స్వర్గం ఏమిటి? అని తగువు పెట్టుకున్నట్లు ఉన్నది శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారి ఆక్షేపణ. అదే 'మిసిమి'లో వచ్చిన లేఖ.

అసలింతకూ ఒక మహాపురుషుడి శీలానికి సంబంధించిన ఒక అపవాదం కోర్టు తీర్పు ద్వారా నిర్ధరించడం అర్థరహితం కాదా? ఒక ప్రవాదాన్ని, ఒక అపనిందను, ఒక దుష్ప్రచా రాన్ని కోర్టు తీర్పుద్వారా ఏకపక్షంగా నిర్ధారణగా ఎట్లా చెప్పగలగడం?! ఇద్దరి మధ్య ఒక వివాదం వచ్చింది. ఒక కోర్టులో ఒకరి పక్షంగా అనుకూలంగా తీర్పు వచ్చింది. అప్పుడు ఇంకో పక్షంవారు అభిశంసనకు గురి అయినారు. ఇంకో కోర్టులో మొదటి కోర్టులో వచ్చిన అనుకూలమైన తీర్పు ఇంకో పక్షం వారికి ప్రతికూలమైంది. అంత మాత్రంచేత ఈ వాదానికి సంబంధించి ఒక కోర్టులో ఒకరికి అనుకూలంగా, ఇంకో కోర్టులో ఇంకొకరికి అనుకూలంగా

తీర్పు వచ్చిందని చెప్పడం న్యాయం. కాని వ్యభిచార నేరంవంటి ఆరోపణలు కోర్టు ద్వారా తిరుగులేని నిర్ధారణ పొందుతాయనటం అవివేకం. ఇంతకూ పరువు నష్టం పట్టింపులూ, కక్షలూ, పట్టుదలలూ సందర్భంలో ఒక పక్షం వాదించే ప్లీడరు తెలివితేటల వల్ల ఒకరికి గెలుపూ మరొకరికి ఓటమి సంభవించవచ్చు. అయితే ఒక అభియోగానికి సంబంధించిన సంభావ్యమైన సాక్ష్యాధారాల వల్లనే కోర్టువారు విచారణ చేయడం, తీర్పు చెప్పడం కదా అనవచ్చు. అటువంటి సంభావ్యతా అసంభావ్యతల ఆధారంగానే ఆనాడు వీరేశలింగం చుట్టూ కొందరు పన్నిన కుట్ర ఫలితమే ఈ అపవాదు అని రుజువు చేయడానికి బోలెడన్ని సాక్ష్యాధారాలున్నాయి.

దీనికంతా పూర్వరంగం ఆయన విరోధులు పదేళ్ళుగా సిద్ధం చేశారు. లోకంలో ఒక అసత్యాన్ని, మహా పురుషయశోహాని కలిగించే దానిని ప్రచారం చేశారు. దీనికంతా పూర్వాప రాల పెద్దనాటకం ఉన్నది. ఇటీవల కూడా వీరేశలింగాన్ని నిష్కారణంగా అపఖ్యాతి పాలు చేయాలనే ఆసక్తి కొందరు కనపరచారు. వాళ్ళ పేర్లు చెప్పడం కూడా అనవసరం.

గిడుగు రామమూర్తి పంతులుగారి హిత వాక్యాలు వినండి. ''పంతుల వారి కీర్తి ప్రతిష్ఠలను గురించి మనకంత ఔత్సుక్యముండ నక్కరలేదు. వాటికి ఆధారము కేవలము సత్యము. సత్యము శాశ్వతము. సత్యము అసత్యముగాను, అసత్యము సత్యముగాను అవివేకులు ప్రకటించినా సత్యా సత్యములు తారుమారు అయిపోవుగాని, కొంతకాలము కొంతహాని కలిగితే కలుగవచ్చును''. పండితులు కొందరు మత్సర గ్రస్తులై వీరేశలింగాన్ని దూషించగా రామమూర్తిగారి స్పందన అది. అట్లానే ఆయన ఇంకొక మాట చెప్పారు. సాధువైన ఒక పదప్రయోగాన్ని దుష్టప్రయోగంగా ప్రకటించడం పతివ్రతను బంధకి అని దూషించడం అని. ఏం చేస్తాం. కొందరి అతిశయం, అజ్ఞానం, చలపాదితనం, కుసంస్కారం అటువంటివి. చీమకుర్తి శేషగిరి రావుగారి వంటి పెద్దలను గూర్చికాదు ఇట్లా అనడం. టంగుటూరి శ్రీరాములు, నాళం కృష్ణారావు ప్రభృతులను గూర్చి.

టంగుటూరి శ్రీరాములుగారు ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారి తమ్ముడు. ఫస్ట్ గ్రేడ్ ప్లీడరుగా ఈయన రాజమండ్రిలో ప్రాక్టీసు చేశారు. ఈయన ప్లీడరుగా రాణించలేదు. ఇంగ్లీషులో కార్లీలియన్ అనే పత్రికను పదేళ్ళపాటు నడిపాడు. అతి శయగ్రస్తుడు, కలహశీలి, దురాగ్రహావేశ పరుడు, దురుద్రేకి అని సమకాలీనుల రాతలను పట్టి తెలుస్తుంది. ప్రకాశం పంతులుగారి ధర్మమా అని బ్రతికిపోయినాడు. లేకపోతే జైలుకు వెళ్ళవలసినవాడు. ఈమాట తమ్ముణ్ణి గురించి ప్రకాశంగారే రాశారు. ఈయనకు వీరేశలింగంపై ఇంత స్పర్ధ ఎందుకు? మచ్చరం ఏమిటి? ఆయనెక్కడ? ఈయనెక్కడ అని అడగవచ్చు ఎవరైనా? అదంతా స్వీయాపాదిత ప్రజ్ఞాదురంధరత్వం కావచ్చు. నేనింతవాణ్ణి, నిప్పులాంటి వాణ్ణి అనే పిచ్చి కావచ్చు. గుర్తింపుకోసం వెంపర్లాటకావచ్చు.

1906లో వీరేశలింగం తన కుల చిహ్నమైన జంధ్యం తీసిపారేశాడు. తాను 'ఆనుష్ఠానిక బ్రాహ్మో' నని ప్రకటించుకున్నాడు. ఇక వెంటనే టంగుటూరి శ్రీరాములు రాజమండ్రి టవును హాలులో మూడు రోజులు సభ జరిపించాడు. ఒక సంఘ సంస్కర్త ఈ విధంగా తన అంతరాత్మ ప్రబోధాన్ని అనుసరించవచ్చునా? అని పెద్ద యాగీ చేశాడు. శ్రీరాములుగా రికి అంతరాత్మ అనేది లేదేమో? అసలది అంత పెద్ద సంఘ సంక్షోభ కారణం ఏమిటి? ప్రళయం ముంచుకొని వస్తుందా వీరేశలింగం తన ఆత్మ ప్రబోధం ప్రకారం నడచుకొంటే!

శ్రీరాములుగారు కూడా కొన్నాళ్ళు బ్రహ్మ సమాజాభిమాని. చదువుకొనే రోజుల్లో క్రైస్తవంపట్ల మొగ్గుచూపారని ప్రకాశంగారే రాశారు. ఇంకా క్రైస్తవం పుచ్చుకొన్నాడేమో? పుచ్చుకొంటే పుచ్చుకోనివ్వండి. వీరేశలింగం జంధ్యం తీసేస్తే ఈయనకేమిటి దుర్గ! ఇదంతా ప్రజా సేవారంగంలో నిజాయితీ కాబోలు. చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు వద్దు మొర్రో నీ పక్షాన నేను సాక్ష్యం చెప్పను, వీరేశలింగం పక్షానే అనుకూలంగా చెపుతాను అని మొత్తుకున్నప్పటికీ వినక చిలకమర్తి వారిని తనవైపు సాక్ష్యం వేసుకొని ఆయన తన అంతరాత్మ ప్రబోధానికి అనుగుణంగా సాక్ష్యం చెపితే పదిహేను సంవత్సరాలు చిలకమర్తి వారితో మాట్లాడటం మానేసిన ప్రబుద్ధుడు శ్రీరాములు. శ్రీరాములు గారి కొడుక్కు ప్రాణాంతకమైన వ్యాధి ప్రబలగా చిలకమర్తివారు చూడ వచ్చినా ఆయనతో శ్రీరాములు మాట్లాడలేదు. అదీ ఆయన క్రోధ దూషిత మనస్తత్వం. ఇదంతా చిలకమర్తి స్వీయ చరిత్రలో ఉంది.

అసలేం జరిగింది? ఎవరీ మంగమ్మ? వీరేశలింగాన్ని ఆయన ప్రతిపక్షులు సందు దొరికింది చాలు అని ఎందుకు ఎలా బాధించారు? ఏం బావుకున్నారు అని వివరంగా చెప్పాలంటే పెద్ద గ్రంథమవుతుంది.

వీరేశలింగం పంతులుగారి ఇల్లాలు రాజ్యలక్ష్మమ్మ బహుదొడ్డ ఇల్లాలు. 'నన్ను కంటికి రెప్పలాగా బిడ్డను తల్లిలాగా చూసుకుంది' అని వీరేశలింగమే రాసుకున్నాడు. వీరేశలింగానికి అరవై రెండేళ్ళ వయసున ఆమె చనిపోయింది. ఇక వీరేశలింగం అనాథ అయిపోయినాడు. తిండీ తిప్పలూ చూసే వాళ్ళు ఎవరూ లేకపోయినారు. తలకింత నూనె రుద్ది స్నానం చేయించేవాళ్ళు లేకపోయినారు. అప్పట్లో హోటళ్ళు లేవాయె. ఆయనెంతో అభిమానస్థుడు. ఆ వయసున వారాలు చేసుకుంటాడా? ముసలివాడికి-అదీకాక అందరూ విరోధులే కదా ఆయనకు-ఆలనా, పాలనా ఎవరు చూస్తారు? వేళకింత అన్నం కరవైంది ఆయనకు. అప్పుడాయనకు ఒక ఆలోచన తోచింది. తాను నిర్వహిస్తున్న వితంతు శరణాలయంలో తాను నీడ కల్పించిన ఒక అగతికురాలు తనకు అభిమాన పుత్రికయై తనను కడతేరుస్తుందేమో చూదామని. ఇల్లాలు చనిపోయిన తర్వాత నాలుగు నెలలకు తలంతా అట్టకట్టుకొనిపోయి శుభ్రంగా జుట్టంతా తీసేయించుకోవలసి వచ్చింది ఆయన. తాను పెంచి పెద్దచేసిన ఒక వితంతు పుత్రుడు తనకింత భోజన వసతికూడా కల్పించలేకపోయాడు. అప్పుడాయన వితంతు శరణాలయంలో అప్పుడున్న ముగ్గురితో ఇట్లా అన్నాడు. ఏమమ్మా మీలో ఎవరైనా సరే పెళ్ళి చేసుకున్నా సరే నన్ను విడిచిపెట్టి పోకుండా నన్ను కడతేర్చే వరకూ దగ్గరుండి అన్నపానాలు చూస్తే వెయ్యి రూపాయలిస్తాను. ఆ వరుడికి ఉద్యోగం ఇప్పిస్తాను. మీకు ఇల్లు కట్టించి మీదగ్గరే ఉంటాను. నామీద ఈ దయ చూపగలరా? అన్నాడు. అప్పుడు దుర్గమ్మ, వెంకట సుబ్బమ్మ, మంగమ్మ అనేవాళ్ళు బాబయ్యా నీకు సేవచేసి నీతోనే ఉండిపోతాం. నిన్ను కడతేరుస్తాం అన్నారు. మరి ముగ్గురిలో ఒకరిని ఎంచాలి కదా? చనిపోయిన తన ఇల్లాలు రాజ్యలక్ష్మమ్మకు కూడా ఎంతో ప్రేమపాత్రురాలు మంగమ్మ. తమ ఇంట్లో కొన్నాళ్ళు పెరిగింది కూడాను. తాను దూరంగా పోవాల్సి వచ్చే మంచి సంబంధం వచ్చినా బాబయ్యమీది ప్రేమతో ఆ సంబంధం నిరాకరించింది మంగమ్మ. దానాదీనా కామరాజుగడ్డ మంగమ్మనే దత్త పుత్రికగా స్వీకరించాడు వీరేశలింగం. కొద్ది రోజుల్లోనే ఆమెకు పెళ్ళి చేశాడు. ఆమె కడుపుతో కూడా వుంది. ఇదంతా తక్కిన ఇద్దరు వితంతువులకు ఈర్ష్యా జనకం కాదా?

రాజ్యలక్ష్మమ్మ చనిపోయిన తర్వాత రెండేళ్ళకు ప్రాణం పోయేంత జబ్బు చేసింది వీరేశలింగానికి 1912లో. అప్పుడాయన చనిపోయాడనే అనుకున్నారు. ఎలాగో గండం గడిచింది. రెండు మూడు నెలలు జావతోనే రెండు పూటలూ గడిపాడు. 1913లో మంగమ్మ ఆయనను ఆదుకుంది. ఆయనను చిన్నప్పటినుంచీ ఉబ్బసం బాధించేది. అది మరీ ప్రకోపించినప్పుడు ఆయన మంచం ఉన్నగదిలోనే పడుకొనేది మంగమ్మ. ఆయన గుండె రాసేది. మందు ఇచ్చేది. మంగమ్మకు కూడా ఒకసారి వీపుమీద పుండు లేచింది. అప్పుడు వీరేశలింగం దానికి మందు రాశాడు. వీపు నిమిరేవాడు. ఇకనేం. ఊరికి దూరంగా అడవిలాగా ఉండే ఆనందోద్యానంలో వితంతు శరణాలయం అభాగినులు కళ్ళలో నిప్పులు పోసుకు న్నారు. చేతులు తిప్పుతూ వీరేశలింగానికి మంగమ్మంటే ఎందుకిష్టమో తెలుసునా? అన్నారు. తమకు పెళ్ళి పెటాకులు కాలేదాయె. వీరేశలింగం వేసవికాలం గడపటానికి మంగమ్మనే బెంగుళూరుకు వెంటబెట్టుకుని పోతున్నాడాయె! ఆమె కడుపుతో కూడా ఉందాయె!

ఈ పాపపు అపవాదు ఊళ్ళోకి పాకించటం ఎంతసేపు? నాళం కృష్ణరావుగారు ఆ రోజుల్లో అంటే 1913 ప్రాంతాలలో మానవసేవ అనే పత్రిక నడిపే వాడు. బరంపురం పట్టుబట్టల వ్యాపారం. మంచి స్థితిమంతుడు. పూర్వులు సంపాదించిన ఆస్తిపాస్తులు ఘనంగా ఉన్నాయి. సాహిత్యాభిమానం కూడా ఉన్నది. మరి వీరేశలింగంతో పడకపోవటం ఎందుకు? మామిడి దేవేంద్రుడనే తన బంధువుని వీరేశలింగం దగ్గరకు తీసుకొని వచ్చి ఈయన ఇంగ్లండు వెళుతున్నాడు బారిస్టరీ చదువుకోడానికి, నేను హామీ ఉంటాను పంతులు గారూ, డబ్బు అప్పివ్వండి అని ఎంతో వినయ వినమిత చాకచక్య భాషణం చేసి వీరేశలింగం చేత డబ్బు అప్పుగా ఆ అపరిచిత వ్యక్తికి ఇప్పించాడు. మూడేళ్ళైంది, నాలుగేళ్ళైంది. ఆ డబ్బులో పైసా కూడా చెల్లు వేయడు? ఏమండీ కృష్ణరావు గారూ అంటే నాకు కాదు కదా నీవప్పిచ్చింది. ఆగవయ్యా ఆయన ఇచ్చిందాకా అని టలాయించాడు. ఈ లోపున ఆ దేవేంద్రుడు ఇంగ్లండుపోనూ పాయినాడు రానూ వచ్చాడు. ఆయన్ను గట్టిగా అడిగితే ఉలకడూ పలకడు. ఇది కాదని లాయరు నోటీసు ఇప్పిస్తే అదంతా తన పరువుకేదో మహా ప్రమాదం తెచ్చాడే వీరేశలింగమని అదేదో పరిష్కారం చేయించాడు నాళం కృష్ణారావు. అది కడుపు మంటగా ఉండవచ్చు. ఉండవచ్చునేమిటి వీరేశలింగంపట్ల చాలా అపచారం చేశానని ఒకసారి కాదు పలుసార్లు పశ్చాత్తాపం ప్రకటించాడు కృష్ణరావు తర్వాత తర్వాత.

ఈ నాళం కృష్ణరావు తన పత్రిక మానవసేవలో వీరేశలింగం పాపం చేస్తూ ఇతరులకు బోధిస్తున్నాడనే వ్యంగ్య పద్యాలు రాసి ప్రచురించాడు. వీటినే ఇంగ్లీషులోకి తర్జుమా చేసి టంగుటూరి శ్రీరాములు కార్లీలియన్‌లో ప్రకటించాడు. వీరేశలింగం చాలా ఆవేశపరుడు. చాలా కోపిష్ఠి. నాళం కృష్ణరావు, టం. శ్రీరాములు, ఇంకా ఆ పత్రిక ప్రచురణకర్త, ముద్రాపకుల మీద కేసు పెట్టాడు. రాజమండ్రిలోనో, పెద్దాపురంలోనో ఈ విచారణ జరిగింది. బార్ట్సువెల్ అనే జాయింట్ మేజిస్ట్రేట్ చార్జెస్ నిరూపణ చేశాడు. నాళం కృష్ణరావు క్షమాపణ చెప్పుకుని బయటపడ్డాడు. శ్రీరాములు నీలుగుతూ కక్ష ఎలా సాధించాలా అని కటకట పడుతున్నాడు.

చీమకుర్తి శేషగిరిరావు గారు రామచంద్రుని వెంకటప్పగారు రాసిన వన్నీ నిజమని భ్రమలో ఉన్నారు. ఆ వెంకటప్ప గారు అన్నీ ట, ట, అని టలాయింపులు సాయిస్తున్నారు.

ఆంధ్రపత్రికలో వీరేశలింగం విజ్ఞాపనం ప్రకటించాట్ట - అసత్యం. 1913 నాటికి రామచంద్రుని గారికి వీరేశలింగం గారి సమకాలికులు అంతా తెలిసినట్లు దబాయింపు ఎందుకు? నేను అనే ఈ రమాపతిరావు(దబాయించడం లేదే - ఆ విషయాలన్నీ శ్రద్ధగా వాకబు చేశాడు. టంగుటూరి శ్రీరాములు మనఃప్రవృత్తిని విమర్శిస్తూ అన్యాపదేశంగా వీరేశలింగం చిలకమర్తి వారు అప్పట్లో నడుపుతున్న దేశమాత పత్రికలో చీవాట్లు పెట్టారు. అది మరింత ఉడుకుబోతుతనం తెచ్చింది శ్రీరాములుకి.

ఇంకో విషయం గ్రహించాలి. ఆ రోజుల్లో రాజమహేంద్రవర స్థానిక కక్షల్లో రాజకీయాలలో పదవీకాంక్షల పీకులాటలలో ఎత్తుకు పైఎత్తులు వేస్తూ ఉండడంలో మునిసిపల్ అధికార లావాదేవీలలో న్యాయపతి సుబ్బారావు పంతులు, నిడమర్తి దుర్గయ్య, ఏలూరి లక్ష్మీనరసింహం, ప్రకాశం, మోచర్ల రామచంద్రరావు, ఇంకా హేమాహేమీలు మాయలు, మంతనాలు, గూఢ విప్రియత్వం సాగిస్తూ ఉండే వాళ్ళు. ఒకరినొకరు దుంపనాశనం కాంక్షించే వాళ్ళు. ప్రకాశం నా జీవిత యాత్ర చదివితే తెలుస్తుంది. స్వప్రయోజనం ఆశ ఉంటే లేదా తన ప్రబల ప్రతికక్షి చావు దెబ్బతిన్నా చాలు, అక్రమ కూటాలకు జంకే వాళ్ళుకారు. అని ప్రకాశమే రాశాడు! అంతశ్శైత్యాలు, ఆగ్రహ దురాగ్రహాలు వాళ్ళలో వాళ్ళ కెన్నో ఉండేవి. 1906 తర్వాత వీరేశలింగానికి రాజమండ్రిలో అభిమానులు లేరు. అనుకూల వాతావరణం చాలా తక్కువ. యువశక్తి అంతా ఆయనకు వ్యతిరేకం. ఆయన్ను హేళన చేసే వాళ్ళు. వందేమాతరం ఉద్యమం వీరావేశంతో ఆయన్ను పిరికి పంద అన్నారు. వీరేశలింగాన్ని దెబ్బతీయడానికిది మంచి తరుణము, మించిన దొరకదని ఆయన పట్ల గొంతు వరకు కోపం ఉన్న 'మిత్రు'లకు 'శత్రువులకు' మా బాగెయెరా? అని ఉల్లాసం, ఉత్సాహం కలిగి ఉంటాయి.

ఇక అసలు కథకు వద్దాం.

ప్రకాశం స్వీయ చరిత్రలో తమ తమ్ముడి గురించి ఏం రాశాడో చూడండి.

''వీరేశలింగం గారికి మంగమ్మ చేసే శుశ్రూష అనేకమైన అపార్థాలకి తావు ఇచ్చి కొంత అపవాదుకి కారణమైంది. ఆ విషయాన్ని గురించి తీవ్రంగా వ్రాయడంచేత వీరేశలింగంగారు శ్రీరాములు మీద జాయింట్ మేజిస్ట్రేటు కోర్టులో లైబెల్ కేసు వేశారు. అప్పుడు నేను ప్రీవీకౌన్సిలు పనిమీద లండను వెళ్ళాను. నేను తిరిగి వచ్చే సరికి ఈ కేసు సగం పూర్తి అయింది. అందరూ కూడా శ్రీరాములు జైలుకి వెళ్ళటం తప్పదని అనుకున్నారు. ఈలాంటి స్థితిలో కీర్తిశేషులైన చిత్రపు వెంకటాచలంగారు నాతో ''ప్రకాశం నువ్వు సరియైన టైములో వచ్చావు. ఈ కేసు స్వయంగా చూడు. శ్రీరాముల్ని జైలుకి పంపడానికి అంతా సిద్ధమై ఉంది. ఈ ప్రాసిక్యూషన్‌లో పెద్దవాళ్ళ తెరవెనుక నాటకం చాలా ఉంది'' అని చెప్పారు. (నా జీవిత యాత్ర - పుట 209 - 1957) టంగుటూరి శ్రీరాములు మీద ఎందుకింత కోపం ఆ పెద్దలకి అంటే తన పత్రికలో అందర్నీ (తానొక్కడే గురిగింజ) బాగా పడదిట్టేవాడు. ఇంతేనా ఇంకా ఇట్లా రాశారు ప్రకాశం పంతులు గారు.

''అప్పుడే ఆ కేసు విచారిస్తూ ఉన్న జాయింటు మేజిస్ట్రేటు ట్రాన్స్ఫర్ అయి, యఫ్.డబ్లియు. స్టూఆర్టు జాయింటు మేజిస్ట్రేటుగా వచ్చాడు. మేజిస్ట్రేటు మారడం చేత విచారణ మొదటి నుంచీ జరగాలని వాదించాను. నా వాదన నెగ్గింది. స్టూఆర్టు నాతోటే లండన్‌లో ఓడ ఎక్కి ఇండియా వచ్చాడు. ఓడలో నేను ఫస్టు క్లాసులోనూ ఆయన సెకండు క్లాసులోనూ ఉండడం చేత కలుసుకోవడానికి వీలు అయ్యేదికాదు. కాని అప్పుడు క్రిస్టమస్

పండుగ అవటం చేత ఆయన్ని ఒడలో కలుసుకున్నాను. విచారణ ఆయన ఎదటే జరిగింది.''

ఇంతేనా? ఇంకా ఉంది!

''మేజిస్ట్రేటు ఈ కేసు ఎందుకు కొట్టివేయకూడదో చెప్పమని అడిగాడు. పంతులుగారు కేసులో వాదించడానికి మద్రాసు నుంచి ఎవరో వస్తారు, అందాకా వాయిదా ఇమ్మని అడిగాడు. కాని ఇవ్వలేదు. చివరికి మేజిస్ట్రేటు కేసు కొట్టివేశాడు. స్టూఆర్టుకి ముందు ఈ కేసు విచారించిన బార్డ్సువెల్ హైకోర్టు జడ్జి అయ్యాక నేను ఒకసారి ఆయన్ను కలుసుకోవడం తటస్థించింది. అప్పుడు ఆయన ప్రస్తావన తీసుకొచ్చి 'తన ఎదుట ముద్దాయి తరపున కేసు సరిగా చెప్పని కారణం చేతనే చార్జి చేశాను' అన్నాడు. ఎల్లాగ అయితేనేం శ్రీరాములు అందులోంచి నెమ్మదిగా బయటపడ్డాడు'' - అన్నాడు ప్రకాశం పంతులు గారు. 1914 జనవరి 31, ఫిబ్రవరి 14 తేదీల కృష్ణాపత్రిక వీరేశలింగం మాన నష్టం దావా అనే శీర్షికతో విపులంగా ఈ కేసును గూర్చి రాసింది. వీరేశలింగం గూర్చి మేము ఉద్దేశించ లేదు. అని వాదించారట శ్రీరాములు పక్షం వారు. ఇదీ ఆయన నిజాయితి. ప్రజాహిత సేవా తత్పరత్వం.

ఈ కేసంతా ఇంగ్లండులో జరిగిన ఒక కోర్టు విచారణ నాధారం చేసుకుని చాకచక్యంగా నడిపించాను అని చెప్పుకున్నారు ప్రకాశం గారు. ఒక మతాచార్యుడు (క్రిస్టియన్ ఫాదరీ) ఒక 'నన్' (క్రైస్తవ సన్యాసిని) వస్త్ర ధారణ గదిలోకి వెళ్ళగా అది తప్పేనని ఇంగ్లండ్ కోర్టు తీర్పిచ్చిందట. దాని నాధారం చేసుకుని మంగమ్మ వీపునిమరడం అపార్థాలకు తావిస్తుందని వాదించి నెగ్గుకొచ్చాడు ప్రకాశం. (అవును మరి దగ్గరలో అంటే ఇరవై గజాల దూరంలో వితంతు శరణాలయం వితంతువులున్నారు గదా వాళ్ళని పిలిపించి మంగమ్మ వీపు మీద మందు రాయించి ఉపచారం చేయించవచ్చు కదా అని స్టూఆర్ట్‌గారి ఆశంక?)

దృఢ గాత్రుడైన కొడుకు జబ్బుగా ఉన్న తల్లిని ఎత్తుకోవడం, ఉపచారం చేయడం భారతీయ సాంఘికానుబంధాలలో తప్పుకాదే! అదే విధంగా తండ్రి పది పదిహేనేళ్ళ కూతురుని కౌగిలించుకోవడం, బుజ్జగించడం, జబ్బు చేస్తే ఎత్తుకొని పడకమీద పడుకోపెట్టటం తప్పా? తప్పు కాదన్నాడు ఎల్విన్ అనే మేజిస్ట్రేటు రివిజన్ పిటీషన్ స్వీకరించి. అయితే రివిజన్ పిటీషన్ కూడదని గగ్గోలు లేవతీశాడు శ్రీరాములు. ఆ పరిస్థితులలో వీరేశలింగం కేసు విత్‌డ్రా చేసుకోవడం తప్పా?

రామచంద్రుని వెంకటప్పగారి వన్నీ అభూతకల్పనలు. టంగుటూరి శ్రీరాములు కాని, నాళం కృష్ణరావు కాని, రామచంద్రుని వెంకటప్ప కాని ఆనంద గార్డెన్స్‌లో మేడగదిలో వీరేశలింగం, మంగమ్మల కాముకకృత్యం దృశ్యం చూశారా? హరి హరీ! ఎంత అన్యాయమైన అక్కసు. ఆ రోజుల్లో విద్యుద్దీపాలు కూడా లేవు. ఎట్లా నిఘా వేశారు. ఈ నిజాయితీ తత్పరులు. ఇంగ్లండు కోర్టులో క్రైస్తవ ఫాదరీ 'నన్' బట్టలు వేసుకుంటున్న గదిలోకి వెళ్ళటమూ, ''తన గేహము, తన దేహము, తన కాలము, తన ధనమ్ము, తన విద్య జగజ్జనులకు వినియోగించిన'' (చిలకమర్తి స్తుతి) వీరేశలింగం పంతులు తన అభిమాన పుత్రిక వీపునిమరడమూ పోలికా? (అన్నట్లు వితంతు శరణాలయంలోని అభాగినులంతా ఆయన్ని బాబయ్యా, ఫాదర్, నాయనా అనే వాళ్ళు. వాళ్ళు పెళ్ళైన తర్వాత వేరే చోటకు వెళ్ళినా అలానే నాన్నా అని సంబోధిస్తూ ఉత్తరాలురాసేవాళ్ళు - ఈ ఉత్తరాలు కొన్ని రమాపతిరావు ఉదాహరించాడు.) వీరేశలింగం డైరీలు, లేఖలు, జీవితచరిత్ర అనే సంపుటంలో ఆయన

దయనీయ పరిస్థితిని తెలియజేసే లేఖలు, దినచర్యతబ్బిళ్ళూ కనపడతాయి.

ఈ అభియోగం విచారణ మధ్యనే మంగమ్మ చనిపోయింది? ఎంత కరుణగాథ అది. తండ్రి కూతుళ్ళకు రంకు కట్టడం!! అదిన్నీ వీరేశలింగం వంటి మహాత్యాగి, కారుణ్యా ఉదాత్తుడి విషయంలో. వీరేశలింగం కూడా ఆ తర్వాత నాలుగేళ్ళకే చనిపోయాడు.

ఆది శంకరాచార్యుల వారు వ్యభిచారి (పరకాయ ప్రవేశం చేసి కళాస్థానాలు, చౌశీతి బంధాలు తెలుసుకున్నాడట) అంటారా ఎవరైనా? అది సహించవచ్చునా? దేశం, కాలం, విశ్వసనీయత, చారిత్రక ప్రమాణం ఆలోచించాలి, అని బుద్ధి చెపుతారా లేదా? ఒకే గదిలో ఒక మంచం మీద 8 నెలలు శయనించాం శారదా దేవీ నేనూ అని శ్రీరామకృష్ణపరమహంస అంటే పోదూ బూటకపు మాటలు అని వ్యాఖ్యానించవచ్చునా ఎవరైనా?ఆమాటంటే 'బమ్మకైన పుట్టు రిమ్మతెగులు' 'పరసతి సంగతి నుండిన' అని సుమతి శతకకర్త ఎంత బాగా చెప్పాడండీ, అంత దాకాఎందుకు మనపోతన్నగారు 'పాలతిదావవహ్ని పురుషుడాజ్యఘటంబు' అని ఎంత బాగా చెప్పారు కాదా, తండ్రీ కూతురూ, తల్లీ కొడుకూ ఒకే పక్క మీద కూచోకూడదు అని చెప్పలేదుటండీ అంటారు. ఇదేమైనా న్యాయమా? వాసిష్ఠంలో శ్రీరాముడికి వసిష్ఠులవారిట్లా బోధించారనిఉన్నదే 'మనఃకృతం కృతం రామ, నశరీరకృతం కృతం, యేనైవా లింగితాకాంతా తేనైవాలింగితాసుతా!' అంటే కూతురిని కౌగిలించుకోవచ్చునే కదా. రామాయణంలో రాముణ్ణీ, భాగవతంలో కృష్ణుణ్ణీ, కౌసల్యాదేవీ, దేవకీ దేవులు దగ్గరకు తీసుకొని తొడల మీద కూచోపెట్టుకున్నట్లు ఉన్నదే. అప్పుడు వాళ్ళేం చిన్న వాళ్ళుకారు. పెళ్ళై కాపురం చేస్తున్నవాళ్ళే. ఎందుకీ వృధా వివాద జిజ్ఞాస. పనిలేకపోతే సరి. మళ్ళీ పాపం మంగమ్మకు జరిగిన అన్యాయానికి కళ్ళుతుడుచు కుందాం. 1925లో నాళం కృష్ణరావు రాజమండ్రిలో వీరేశలింగం జయంతినాడు తాను చేసిన పాపకృత్యానికి వగస్తూ 'అనుతాపము' అనే పేరిట పద్యాలు చదివి వినిపించాడు. ఆ తర్వాత 1948 వీరేశలింగం శత జయంతి నాడు చిలకమర్తి మృతి సంస్మరణ సభలో ఇట్లా చెప్పాడు. ''వీరేశలింగం గారు ప్రథమ వితంతు వివాహము జరిపించిన రోజున తాము పుట్టితిమనియు తమ ఏడవ ఏట బసవరాజు గవర్రాజు గారితో వీరేశలింగం పంతులు గారింటికి వెళ్ళితిననియు తమగురువు గారికి తీరని అపకారము చేసితిమనియు శ్రీ పంతులు గారు చనిపోయిన తర్వాత తమకు పశ్చాత్తాపము కలిగెననియు అప్పుడు అనుతాపము అనుగ్రంథమును వ్రాసితిమనియు తెల్పిరి'' (ఆంధ్రప్రభ ఏప్రిల్ 21, 1948 - దినపత్రిక). ఎవరు ధూర్తులు?

ఇక ప్రకాశం పంతులుగారు 1948లో వీరేశలింగం పంతులుగారికి ఘనంగా నివాళి అర్పిస్తూ

''గాంధీజీకి పూర్వమే ఆయన జీవిత కాలంలో ప్రచారం చేసిన ధర్మసూత్రాలను తెలుగు నాట ప్రబోధించిన మహాపురుషుడు శ్రీ వీరేశలింగం పంతులు గారు. ఆయనయే నేటి దాక జీవించి ఉంటే సమస్త భారతావని ఆయన సూత్రాలను అనుసరించి ఆయన్ను ఆరాధ్య దైవంగా పూజించి ఉండేది.

వీరేశలింగం పంతులు చాల గొప్ప వాడు. వారు కాలేజీలో పండితులుగా ఉండి విద్యార్థులకు బోధించడంతో తృప్తి నొందక సర్వజనులకు స్త్రీలకు పురుషులకు గొప్ప వారికి చిన్నవారికి అందరికి కూడ అనగా సామాన్యజనులందరికీ కూడా ప్రబోధం చేయుటకుగాను స్వయముగా పత్రికలను నడిపించుమూలముగా సులభ శైలిగ్రంథములు వ్రాయుట మూలముగా

ప్రపంచమునకు వెరవక మతమును గురించి సంఘసంస్కరణములను గురించి అనేక గ్రంథములు వ్రాసి ప్రజలకు నిజమైన జ్ఞానము కలిగే లాగున కృషిచేసి యుండెను. ఆ చీకటి కాలములో ఆయన చేసే ప్రబోధమంతా కార్యరూపముగా ఫలించక పోయినప్పటికీ 70 సం. లు అయిన తర్వాత గాంధీగారు ఆ సిద్ధాంతములన్నియు బోధించుట చేత ఇప్పుడు అన్నీ కార్యరూపముగా ఫలవంతములై కనపడుతున్నవి'' (ఏప్రిల్ 16, 1948, ఆంధ్రప్రభ దినపత్రిక)

ఇంకా ఈ ప్రస్తుతి చాలా విపులంగా ఉంది. తానెంతో గౌరవించే వీరేశలింగాన్ని క్రాస్ ఎగ్జామిన్‌చేసి ముప్పతిప్పలు పెట్టినందుకు చాలా బాధకలిగిందని ప్రకాశం స్వీయ చరిత్రలో రాసుకున్నాడు. ప్రకాశం నిజంగా పెద్దమనిషి. ఇంతకూ వీరేశలింగం పంతులు గారు చేసిన ఘోరనేరమేమిటి? ఆయన్ను బసవేశ్వరుడితో పోల్చారు అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు. నిజానికాయన అంత ఆవేశపరుడు. ఉద్యమి.

ఇక చారిత్రక పురుషులను గూర్చి వృత్తాంతాలు వెలుగు నీడలతో తెలుసుకోవడం దూష్యం కాదంటున్నారు మా రామచంద్రుని వెంకటప్పగారంటున్నారు శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారు మిసిమికి ఆదుర్దాగా రాసిన ఒక లేఖలో.

అది తప్పు కాకపోవచ్చు కాని అన్ని సంగతులు తెలియకుండా, సమన్వయం చేసుకోకుండా రాయడం దురాలాపమే అవుతుంది. ఆయన రాసిన ధోరణిలో ఆయన అన్న 'అంగలార్పు' కనపడుతున్నది. గుంటూరు నుంచి 'ఆంధ్ర' అనే ఇంగ్లీషు పత్రిక ఆంధ్ర ప్రముఖుల జాబితా వీరేశలింగం పంతులుగారి పేరు లేకుండానే ప్రచురించిందట. ఇందుకు బొంబాయి నుంచి వెలువడే 'సోషల్ రిఫార్మర్' అంగలార్చిందని సంతోషిస్తున్నారు వెంకటప్పగారు. వీరిరాతను బట్టి ఇది 1913 అని తెలుస్తున్నది. కాని ఇంకా రెండేళ్ళకు ముందరే (1911) అదే గుంటూరు నుంచి శ్రీ జొన్నవిత్తుల గురునాథంగారనే వారు వీరేశలింగాన్ని గూర్చి ఇంగ్లీషులో గొప్ప జీవిత చరిత్ర రచించి ప్రకటించాడని వీరికి తెలుసో తెలియదో! 'వీరేశలింగం ది ఫౌండరాఫ్ ఆంధ్రా పబ్లిక్ లైఫ్' అని ఆ గ్రంథం పేరు. బహుశా ఒక తెలుగు మహాపురుషుణ్ణి గురించి ఇంగ్లీషులో వచ్చిన జీవిత చరిత్రలలో శ్రీ గుర్నాథం గారిదే మొదటిదై ఉంటుంది. తదాది తెలుగు సాహిత్యంలో సామాజిక జీవనంలో వీరేశలింగం ప్రస్తావన లేకుండా ఏ చర్చ, ఏ సిద్ధాంతం, ఏ నిర్ణయం సాగుతున్నాయి? ఇక కోర్టు తీర్పును గురించి సంతోషించే వారికి ప్రకాశం పంతులు గారు కోర్టులను గూర్చి 1927లో కేంద్ర చట్ట సభలో వెలువరించిన అభిప్రాయం కనువిప్పుకాగలదు. 'Success in Courts' అని ఆ ప్రస్తావన (23-3-1927) "Now to say that Justice could be done in these days; with regard to these laws (Hindu or Mohammadan laws) is simply a perversion of Truth; It is more Chance and accident. It is a gamble in litigation; it is a criminal waste of money" ఇదండీ ప్రకాశంగారి పరితాపం. హితవు. ఉద్ఘాటన.

కాని ఏం లాభం. భాగవతంలోనే చెప్పారు 'న్యాయ పద్ధతి బుధులైన నడవరంద్రు' అని.

'ఏం వీరేశలింగమో? ఏం వెలుగో! ఏం నీడో!

నా తెనుగుదేశమా? నా అనుగు దేశమా?

ఆయన ఖర్మ ఇట్లా కాలి తెలుగు వాడై పుట్టాడు. అనుభవించక తప్పుతుందా?!

# ప్రపంచంలో ఉత్తమోత్తమమైన విద్యాబోధన

సేకరణ:
సుజాత సూరపనేని
U.S.A.

చదివించటం (రీడింగ్)
న్యూజిలాండ్

పిల్లల చిన్నతనం
(ఎర్లీచైల్డ్ హుడ్)
ఇటలీ

లెక్కలు
నెదర్లాండ్స్

సైన్స్
జపాన్

భాషల అధ్యయనం
నెదర్లాండ్స్

కళ
అమెరికా సంయుక్త రాష్ట్రాలు

హైస్కూల్ విద్య
జర్మనీ

అధ్యాపకుల శిక్షణ
జర్మనీ

పట్టభద్రుల స్కూలు
అమెరికా

వయోజన విద్య,
స్వీడెన్

ప్రజలు తమ పిల్లల గురించి ఆందోళన చెందుతారు. దేశాలు తరువాతి తరం గురించి ఆందోళన పడతాయి. అమెరికా తన సంతానం బాగా చదువుకుని భవిష్యత్తులో సాంకేతిక ఉద్యోగాలను చక్కగా నిర్వహించ గలిగితే చాలు అనుకుంటుంది. తూర్పు యూరపు దేశాలు తమ విద్యార్థులను కొత్త మార్కెట్ ప్రదేశాలలో జీవించ గలిగేలా తయారు చేయాలనుకుంటుంది. ఇతరులు చేసిన పరిశోధనలకు పొడిగింపుగా వుండకుండా అది ఆపుచేసి జపాన్ వారు కొత్త విషయాలలో శాస్త్రజ్ఞులకు శిక్షణ నిచ్చి వారిచే నూతన సంగతులను ఆవిష్కరింపచేస్తారు. (అంటే కొత్త బ్రేక్ త్రూలు సాధించాలి) త్వరితగతిని మారే ప్రపంచంలో భవిష్యత్తులో మనం ఏవిటి యితరుల కంటే వెనుక బడతామా అనే చింతన సహజం. మారే కొత్త ప్రపంచంలో మనం ఎక్కడ వుంటాము అనే ప్రశ్న సహజంగా తలెత్తుతుంది.

అందరి కంటె పైన వుండాలంటే ఏం చెయ్యాలి? మంచి స్కూళ్ళ కోసం తహ తహలాడడం అనేది ఒకటి, పోటీని ఎదుర్కోవడం అనేది రెండవది. లెక్కలు (గణితం) సైన్స్ బోధించడం విషయంలో బుష్ పాలకవర్గం అమెరికా 2000 సంస్కరణలని మొత్తం పునర్వ్యవస్థీకరించడానికి తలపెట్టింది.

మన భారతదేశంలో లేదా ఆసియా దేశాలలో బంగ్లాదేశ్, పాకిస్తాన్, సిలన్ యిటువంటి ఆలోచనే లేదు. విద్యా విధానాన్ని ఎటువంటి విద్య ఎటువంటి పౌరుల్ని మన అవసరాలకు తయారు చేస్తుంది అనే విషయమ్మై చింత లేదు. 2000 సంవత్సర నాటికి అమెరికా విద్యార్థులు ప్రపంచంలో అందరికంటె ప్రతిభలో ముందు వుండాలి అని యిప్పట్నుంచీ తయారవుతున్నారు. దీనికి సరిగ్గా వ్యతిరేకంగా వుండే మరో ఊహ ఏవిటంటే - చదువుల్లో అంతర్జాతీయ సహకారం వల్ల విద్య ప్రోత్సహింపబడుతుంది అనేది చాలా మంచి విధానం. ఇండియా వంటి వెనుకబడిన దేశాలకు ఎంతో మంచిది. సినిమాలు కన్స్యూమరిజం గుండాలు టెర్రరిజం మధ్య నలిగిపోతున్న యువతరం దృష్టి చదువుల వైపు మంచి చదువుల వైపు 2000 సంవత్సరం నాటికి మనం ఎలా వుండాలి అనే యోజన వైపు మళ్ళిస్తే మరీ మంచిది. ఇతర దేశాలలో వున్న విద్య విధానాలు ఏవిటి అని యిప్పుడే మన వాళ్ళు కళ్ళు తెరిచి పలికిస్తున్నారు - లేదురా యిటువంటి భూదేవి ఎందు లేదురా మనవంటి ధీరులింకెందు అని స్వకుచమర్దనాలు సాగించకుండా. (ఈ దళితులు వెనుకబడిన మైనారిటీ వర్గాలను ప్రోత్సహించడం అనే ఓట్లను సంపాదించి పెట్టే వెర్రినుంచి రాజకీయ నాయకులు తలెత్తి స్టేట్స్మన్ లాగా ఆలోచించి పడిపోతున్న విద్యా ప్రమాణాలతో మన యువతరం అంతర్జాతీయ పోటీని చదువులలో ఎదుర్కొనగలరా? లేకపోతే ఏవిటి చెయ్యాలి అని ఆలోచించాలి).

చదివించడంలో న్యూజిలాండ్ మంచి మార్గం కనుక్కొంటే మనం దాన్ని ఫాలో కావచ్చు. జర్మనీలో వృత్తులలో ప్రవేశానికి మంచిశిక్షణ యిస్తారట. పొరుగు రాజ్యాలవారు యీ విషయంలో జర్మనీ నుంచి నేర్చుకుని లబ్ధిపొందవచ్చును. ఇండియాలో వృత్తి శిక్షణ అంటే నిరాదారణ ఎక్కువ. అలసత్వం మాని జర్మనీ పద్ధతులను మనం కూడా అనుసరించాలి. అందరికీ విద్య అంతర్జాతీయ సమస్య. ''చాలామటుకు అందరి అభిప్రాయం ఏమంటే స్కూళ్ళు సరిగా పనిచేయడం లేదు. చాలా ఆర్థిక సాంఘిక సమస్యలకు సరైన విద్యలేక పోవడమే మూల కారణం'' అంటున్నాడు. యీ సమస్యపట్ల దృష్టి సారించిన ప్రపంచ విద్య నిపుణుడు షరన్ పికెట్.

రెండవ ప్రపంచ సంగ్రామానంతరం జపాన్, జర్మనీ, నెదర్లాండ్స్ దేశాలు వారి సమాజాలను పునర్ వ్యవస్థీకరించుకున్నట్లే విద్యా విధానాలను కూడా మార్చుకుని సరిచేసుకున్నారు. అక్కడి విద్యార్థులు ప్రపంచం అంతటిలో అభివృద్ధి చెందిన గణితంలో ముందు సీటున వున్నారు. సైన్స్, సాంకేతిక విషయాలలో ప్రపంచంలో అగ్రగాములుగా వున్నారు. అయితే అటువంటి విజయవంతమైన స్కూళ్ళలో కూడా లోపాలు వున్నాయి. జర్మన్ స్కూళ్ళలో గణితంలో సైన్స్లో చదువు బాగా చెప్పే ఉపాధ్యాయుల కొరత వుంది. జపాన్ స్కూళ్ళ విధానం కష్టతరంగా (రిజిడ్) వుంటుంది. ఆసియా దేశాలలో చాలా భాగం జపాన్ స్కూళ్ళ విధానాన్నే అనుసరిస్తారు. ఇక్కడ తయారయే వారిని కేవలం గుడ్డిగా మూసపోసినట్లుండే వ్యాపార పురుషుల్ని తయారు చేస్తున్నారు. వీళ్ళకు ఊహాశక్తి తక్కువ అన్న విమర్శలు వచ్చాయి.

ఒక స్కూలు మంచిదని ఉత్తమమైనదని ఎలా నిర్ణయించి చెబుతారు? ఉత్తమమైన స్కూలు అనగా ఏది? విపరీతంగా డబ్బు వెచ్చించేవి గొప్ప స్కూల్సు కాజాలవు. జర్మనీ జపాను దేశాల్లో యు.ఎస్.ఏ.లో కంటె 50 శాతం విద్యార్థి మీద తక్కువ ఖర్చు పెడతారు.

అయినప్పటికీ వారికంటె వీరు మిన్న. చదువుల్లో నిపుణులు. డబ్బు ఏ విధంగా ఎందుకు కర్చుపెట్టారు. దాన్ని బట్టి ఫలితాలు వుంటాయన్నారు. అమెరికాలో భవన సముదాయం పరిపాలనా వ్యయం ఎక్కువ. టీచర్ల మీద కర్చుపెట్టేది తక్కువ. జపాన్, జర్మనీల్లో అధ్యాపకుల జీతాలు చాలా ఎక్కువ. టీచర్ల జీతాలమీద అధిక్య వ్యయం చేస్తారు. చదువు చెప్పే విద్యావంతులు చదువుమీద శ్రద్ధ విలువ కల దేశాలు స్కూళ్ళలో ఎక్కువ కాలం విద్యార్థులు గడిపేట్లు చేస్తాయి. దక్షిణ కొరియాలో చదువుపట్ల భక్తి శ్రద్ధలు చాలా ఎక్కువ. 55 శాతం విద్యార్థులు కాలేజీ చదువులకు వెళ్తారు. కొరియాలో విద్యావంతులు కావడం అనేది ప్రపంచంలో అన్నిటికంటే ముఖ్యమైన పవిత్రమైన కార్యం.

ఒకే పద్ధతిలో వుండటం అద్భుతమైన ఫలితాలకు కారణం కాగలదు. ఏ చదువులు ఎప్పుడు చెప్పాలి అనే దానిమీద టీచర్లకు కచ్చితమైన అవగాహన వుంటుంది. స్కూలులో వుండే రోజులు ఎక్కువ అయితే మంచి ఫలితాలు వస్తాయి. జపాన్‌లో విద్యా సంవత్సరం 240 రోజులు. జర్మనీలో 210. అమెరికాలో 160 రోజులుంటాయి చదువులు. ఏడాదిలో సామాజిక ఆర్థిక స్థితిగతుల మీద ఆ సమాజంలో చదువులు ఆధారపడి వుంటాయి. ఒక ప్రాంతంలోని రాజకీయాలు, సంస్కృతి, ఆర్థిక సామాజిక స్థితిగతులు చదువులమీద ప్రభావాన్ని చూపిస్తాయి. కుటుంబాలలో విడాకుల సమస్య వుంటే, లేనిచోట్ల పిల్లల చదువుల్లో తేడాలు ప్రస్ఫుటంగా వుంటాయి. విద్యార్థుల్లో గొడవలు ఎక్కువగా అమెరికాలో వుంటాయి. అక్కడ నానా జాతుల ప్రజలూ - రకరకాల సమస్యలూ.

## న్యూజిలాండు

న్యూజిలాండ్ దేశంలో పిల్లలకు బాగా చదవగలగడం రాయడంలో నేర్పు సహజంగా వస్తుందట. చదవగా చదవగా మంచి విద్యావంతులవుతారు. అంతర్జాతీయ అక్షరాస్యతా పరీక్షలలో న్యూజిలాండ్ పిల్లలు అగ్రగామిగా నిలిచి బహుమతులు సంపాదించారట. వాళ్ళ పుస్తకాలు వాళ్ళకు విద్యగరిపిన విద్యావంతుల్ని ప్రపంచమంతటా కోరుతున్నారు. చదువు చెప్పే వాళ్ళ విధానం కొత్త కల్పనలు చేసేదిగా వుంటుందిట. అది స్వయంగా కాల్పనిక పద్ధతి. పిల్లలు తమంతట తాము గ్రహించుకుని వేగంగా అభివృద్ధి చెందుతారట. అంటే నిర్బంధంగా కంఠత పట్టించడంలా వుండదు. ప్రతి పిల్లవాడు క్షుణ్ణంగా తప్పులు లేకుండా బాగా చదవగలుగుతాడు - వాడు ఎక్కడ నుంచి ఎటువంటి నేపథ్యంలోంచి వచ్చినా ఒక్కలాగే చదువులో వుంటాడు. శైశవ పాఠశాలా ఉద్యమం అని 1940లో బ్రిటన్‌లో ప్రసిద్ధ మయింది యీ ఉద్యమం. విభిన్న వయసులకు చెందిన పిల్లల్ని తమ కిష్టమయిన ప్రాజెక్టులను ఎంచుకుని వాటిమీద తమకిష్టమైన రీతిలో వేగంతో పనిచేయమంటారు. ఇదే పద్ధతిని న్యూజిలాండ్ లో మెరుగుపరచి అనుసరించారు. విద్యార్థుల మిగతా పిల్లలతో కలిసి పనిచేస్తారు. కొత్త కొత్తవి తెలుసుకోగానే (నైపుణ్యం పట్టుబడగానే) ఒకదాని నుంచి మరొక దానికి మారుతారు. గ్రూపులు గ్రూపులుగా వుంటారు. వాళ్ళ పని వాళ్ళు చేసుకుంటూ తమకంటె వయసులో చిన్నవారికి వీరు సహాయం చేస్తారు. చదువు చెప్తారు. ప్రతి ఏడూ యీ విద్యా విధానంలో మార్పులు చేర్పులు జాగ్రత్తగా ప్రవేశపెడుతూ వుంటుంది ప్రభుత్వ విద్యాశాఖ.

ముందు అక్షరాలు ఆ తరువాత మాటలు ఆ పిమ్మట వాక్యాలు అలా చదవడం అమెరికాలో నేర్పుతారు. న్యూజిలాండు పద్ధతి వలన మొత్తం భాష అంతా వస్తుంది పిల్లలకి అంటారు.

న్యూజిలాండ్ వారు భాష నేర్వడానికి మాది సహజ పద్ధతి అని వాదిస్తారు. ఇందుకే తయారుచేసిన పుస్తకాలు సరళమైన భాషలో వేరే వుంటాయి. చదవడం రాయడం అనే ప్రక్రియలు కలిసే నేర్పుతారు. కొన్ని మాటలను ఎలా ఉచ్చరించాలో నేర్పుతారు. కొన్ని మాటలను ఎలా ఉచ్చరించాలో నేర్పుతారు కాని వల్లె వేయించరు. చదవగా చదవగా చదవడం అదే వస్తుంది అన్నది వారి సూత్రం. ఒక పెట్టెలో వున్న పుస్తకాలలోంచి పిల్లలు చదవటానికి కావలసిన పుస్తకాన్ని వారే ఎంచుకుంటారు. ఆ పుస్తకాలన్నీ అందుకోసం జాగ్రత్తగా చేసినట్టివి. రాయడం దగ్గరకొచ్చే సరికి వ్యాకరణం, స్పెల్లింగులు నేర్పుతారు. శబ్దం రూప నిర్మాణం గురించి చర్చిస్తారు. చదవడంలో తడుముకోకుండా ......చదివే వారిని వేరుచేసి వారికి స్వతంత్రమైన మరో వ్యావృత కల్పిస్తారు. పిల్లలలో అనేక జాతుల వారు అనగా మయోరి, సమోక, ఇండియన్, చీనా, ఫిలిప్పైనో, తెల్లవారు కూడా వుంటారు. (మనస్కూళ్ళలో కులాల వారీ పిల్లలున్నట్లు) రీడింగ్ లెవెల్స్‌ని టీచర్లు బాగా చెక్‌చేసి అందరినీ గడ గడ చదివే స్థాయికి తెచ్చాక మిగతా విషయాలు (సబ్జక్ట్స్) బోధిస్తారు. అర్ధరోజు క్లాసులో చదవడానికి రాయడానికి వినియోగిస్తారు. పుస్తకాలను బాగా పరిశీలించి పరీక్షించి చదివేందుకు పెడతారు.

## ఇటలీ

**పిల్లలంతా ఒకటి కాదు. రకరకాలుగా వుంటారు అన్న ప్రాతిపదికమీద ఇటాలియన్ స్కూళ్ళ విద్యా విధానం వుంటుంది.**

పిల్లల సృజనాత్మక శక్తిని కళల ద్వారా ప్రోత్సహించడం ఒక పద్ధతి. ఎక్కడ చూసినా డయాన స్కూలులో పిల్లల ఆర్టు గోడల మీద బల్లలమీద కనిపిస్తూ వుంటుంది. తీగలతో గింజలతో మట్టితో తెల్ల మట్టితో బొమ్మలు పిల్లలు చేసినవి అంతటా కనిపిస్తాయి. చెట్లు, రకరకాల ఆకులు వీటి మధ్య పిల్లలకు కనపడకుండా వుండాలనుకుంటే మారు వేషాలు ధరించడానికి డ్రెస్సింగు రూములుంటాయి. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఇటలీలో దృష్టి పిల్లలమీదకు మళ్ళింది. జర్మనులు తిరోగమించాక మొదటగా వారు ఆలోచించినవాట్లలో పిల్లల చదువు ఒకటి. పిల్లలు తల్లితండ్రులు కలిసి స్కూలును (డయాన) నిర్మించుకున్నారు. బాల్యానికి ముందు దశలో పిల్లల్ని తయారుచెయ్యడానికి శైశవ విద్యాలయాలు వెలిశాయి. పిల్లలంతా ఒకలా వుండరు, ఎవరికి వారే యమునా తీరే అనే పద్ధతిమీద నడుస్తాయి. శైశవం నుంచి ఆరు సంవత్సరాల ప్రాయందాకా టీచర్లం 'కరిక్యులం' తయారుచేస్తే తల్లితండ్రుల వచ్చి సహాయపడ్డారు కూడా. ప్రపంచాన్ని అర్థంచేసుకోవడానికి అందులో బతకడానికి వీలుగా పనులు నేర్పుతారు. కళలా కనిపించే దాంట్లో నిజానికి సైన్స్ (విజ్ఞానం) దాక్కొని వుంది. సైన్స్ లెక్కలు కళ అన్నీ ఒక్కచోటే నేర్చుకుంటారు. ఒక టేబిల్‌వద్ద తీగలతో ఆకులు చేస్తుంటే మరొకచోట మట్టి, కాగితాలు, పెయింట్‌తో పిల్లలు పనిచేస్తూ వుంటారు. చెట్టుబొమ్మ పెయింటింగ్ వేసి నిజమైన ఆకుల్ని అతికిస్తారు. 3 సంవత్సరాలలోపు శిశువులను 'నెస్టు' అంటే గూడు అని అంటారు. తరువాత మాతృత్వపాఠశాలకు 3-6 పిల్లలను తర్లిస్తారు. 24మంది శిశువులకు ఇద్దరు టీచర్లు వుంటారు. పిల్లలు స్వేచ్ఛగా తిరుగుతూ ఆడుకుంటూ మధ్యలో ఒకచివరి గదిలోకి వెళ్ళి చిరుతిళ్ళు తినివస్తూంటారు. ఆ ఆటలుకూడా వయసునుబట్టి వుంటాయి. దీనిని రెగోసిస్టిం అంటారు. ఇది చాలా

శ్రీమంతులకు ఇటలీలోని సమైక్ ప్రాంతంలో వుందట. అందర్నీ చేర్చుకోరు. వికలాంగులైన పిల్లలకు, తల్లిగాని, తండ్రిగాని ఒకరే వున్నప్పుడు అటువంటివారి పిల్లలకు ముందు ప్రవేశం ఉంటుంది. మిగతావారికి ప్రవేశపరీక్ష వుంటుంది. ఐదు సంవత్సరాల వయసు వచ్చేసరికి వారికి ఉత్తరం రాయడం వస్తుందట.

## నెదర్‌లాండ్స్

ముస్లిముల ప్రార్థనచేసే మసీదు కాంపాస్ వైపు చూపిస్తూ వుంటుంది. క్లాసురూంలో కంపాస్ గురించి చెప్పడానికి నెదర్‌లాండ్స్‌లో దిక్సూచిని తెస్తారు. కోణాలను కొలవడానికి డిగ్రీలు అలా నేర్పుతారు. లెక్కల పుస్తకాలలోని సమస్యలను పరిష్కరిస్తూ వుంటారు విద్యార్థులు. అందరిదగ్గర చిన్నచిన్న లెక్కలకు కూడా కేలిక్యులేటర్లు వుంటాయి, ఉపయోగిస్తారు. డచ్చి పిల్లలకు గణితం అంటే మక్కువ ఎక్కువ. మంచి మార్కులు సంపాదిస్తారు జపాన్‌లో వారివలె. పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన దేశంలోని పిల్లలతో సమానంగా గణితం చేస్తారు. స్కూళ్ళలో వాస్తవగణితం (రియలిస్టిక్ మాథమెటిక్స్) పిల్లలకు ప్రారంభదశలోనే చెప్తారు. పిల్లలకు లెక్కలు చేసే సహజమైన పద్ధతి ఒకటి వుంటుందనే ప్రాతిపదికమీద వాస్తవగణితం ప్రారంభమవుతుంది. పుల్లలు, చక్కలతో చిన్నపిల్లల గణితం ప్రారంభమవుతుంది. తరువాత పిల్లలు స్వయంగా తెలుసుకుంటూరు వారికి నచ్చినంతవేగంగా జవాబులు కనుక్కుంటారు. లెక్కలకి జవాబులు వారంతటవారే అన్వేషించి కనుక్కుంటారు. లెక్కలకు సమస్యలు కల్పించుకుని తామే ఆన్సర్స్ సాధిస్తారు. సూత్రాలు ఫార్ములాలు బట్టీవెయ్యడంకంటె సమస్యల్ని కనిపెట్టి మదింపుచేసి ఆన్సర్స్ కనిపెడతారు. సామాన్యగణితం ముందుబాగా వచ్చినతరువాత ఆల్జీబ్రా, జ్యామెట్రీ, గణాంక శాస్త్రము చెబుతారు. వాస్తవగణితం వీటన్నిటినీ కలిపి అంచెలంచెలుగా అన్నీ చెబుతుంది.

ముఖ్యమైన సంగతి ఏమిటంటే కొత్తపాఠ్య ప్రణాళిక ప్రవేశపెట్టేముందు వాస్తవమైన ప్రపంచ సమస్యను తీసుకుని చర్చించి, దానితో దీనిని సమన్వయపరిచి నిత్యజీవితంలో గణితం ఎంత సంపూర్ణమైన భాగమో స్ఫురించేలా చేస్తారు. ఈ గణితాన్ని మీరు వార్తలు వింటూకూడా అన్వయింపచేయవచ్చు. డచ్చి పిల్లలు వాస్తవ గణితంతో ప్రారంభిస్తారు. ఇంజనీర్లు , భౌతిక శాస్త్రజ్ఞులు కాబోయే విద్యార్థులు వారి హైస్కూలు, కాలేజీ చదువుల్లో రూపగణితం, సంగ్రహగణితం నేర్చుకుంటూరు. చాలామంది పిల్లలకు యాబ్‌స్ట్రాక్ట్ గణితంతో శ్రమపడేశక్తిసామర్థ్యాలు వుండవు. ఈ రకమైన గణితం తరవాత వారికి నిత్యజీవితంలో వుపయోగపడదు. సమాజంలోవారికి పనికివచ్చేవిద్య గరపాలి మనం అంటారు అధ్యాపకులు. 90శాతం హైస్కూలు విద్యార్థులు లెక్కలలో పెద్దకోర్సులు తీసుకుంటున్నారు. విశ్వవిద్యాలయపు చదువుల్లో లెక్కలు తీసుకునేవారిలో మార్పులేదు. మళ్ళీ హైస్కూలు ఆడపిల్లలు గణితం తీసుకోరు. డచ్ పద్ధతులు గణితం నేర్పడంలో ప్రపంచంలో అగ్రశేణికి చెందుతాయి.

వచ్చే సంచికలో
(రెండో భాగం)

★ ★ ★

# సృజనాత్మక కవి పెర్సీ బిష్ షెల్లీ

సేకరణ:

– అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

షెల్లీ ఒకసారి ఒక పంతులమ్మకు ఒక ఉత్తరం రాశాడు. అందులో ఇలా ఉంది: ''నేను కులీనుడని కాను, ఆ మాటకొస్తే పాలకుడిని అంతకంటె కాను. ప్రకృతికి, హేతువుకు బద్ధుడనై అంటే గుణవంతుడనై జీవితాన్ని కొనసాగించాలని కోరతాను''. ఈ సమాజం కుళ్ళిపోయిందని, ప్రతి ఒక్కరు ప్రకృతి ఒడిలో పరవశించాలనీ చెప్పిన రూసో కంటె మరో మెట్టు పైనే ఇతడు ఉన్నాడనిపిస్తుంది. ఇతడి దృష్టిలో మేధావులు, కవులు ప్రత్యేక స్థానాన్ని ఆక్రమిస్తారు. అసలు కవులైతే పేరు పెట్టని శాసనకర్తలు.

10,000ల పదాలతో 1821లో అతడు రాసిన ''A Defense of Poetry'' లో సాహిత్యం యొక్క సామాజిక ప్రయోజనాన్ని గురించి చెప్పాడు. పద్యం అంటే కేవలం అందమైన పదాల అమరిక కాదు, లేదా వినోదమూ కాదు. ఏ ఇతర సాహితీ ప్రక్రియ కంటె పద్య కవనం భవితవ్యానికి ఎక్కువగా బాటలు వేసేది, జ్ఞాన సంబంధి. సామాజిక ప్రగతి అనేది నైతిక సద్బుద్ధి (ethical sensibility) తో నిర్దేశితం కావాలి. మతం ఈపని చేయలేకపోయింది. విజ్ఞానశాస్త్రం ఈ పనిని అసలు చేయలేదు. హేతువాదం ఒంటరిగా ఈ పనిని నిర్వర్తించలేదు. ఒక్క కవనం మాత్రమే నైతిక శూన్యతను పూడ్చి ప్రగతికి సృజనాత్మక శక్తిని అందించగలదు. పద్యం మాత్రమే మనస్సును పెంచి, సాగదీసి, రకరకాల ఆలోచనా సంయోగాలకు గ్రాహకపాత్రగా చేయగలదు. అది మాత్రమే ప్రపంచం గుప్త అందాల, సోయగాలపై ఉన్న ఆచ్ఛాదనాన్ని తొలగించగలదు. ''నీతి రహస్యం - ప్రేమ మన స్వభావాన్ని వదలి బయటకు నడవడం. తనలోని ఆలోచన, క్రియల్లో ఉండే అందంతో కాక పరులతో ఉన్న ఆ అందంతో తాదాత్మ్యం చెందాలి. అది ''అహం కేంద్రీయతను'' బద్దలు చేస్తుంది. ఇహాన్ని తగ్గిస్తుంది. సామూహిక భావాన్ని అధికం చేస్తుంది''. ''మనిషి మంచివాడు కావాలంటే, తాను ఇతరుడై చూడాలి; ఇతరుల బాధా సుఖాలు తనవి కావాలి. కవనం కారణం మీద పనిచేసి ఫలితాన్ని సరిదిద్దుతుంది.'' ''నాగరకతా నైతిక ప్రగతిని కవనం సాధిస్తుంది. వాస్తవానికి కవనం, దాని సహచరి అయిన ఊహ, దాని సహజ పరిసరమైన స్వేచ్ఛలు నాగరకతకు, నీతికి ఆధారాలు. సమాజ పూర్తి పునర్నిర్మాణానికి కవితా కల్పన కావాలి''. – దీని అర్థం సమాజాన్ని కవులు ఏలాలని కాదు: మొదటిసారిగా అతడు పందొమ్మిదవ శతాబ్దికి ముఖ్య లక్షణం అయ్యే భౌతికవాదానికి విమర్శగా ఈ వాదనను లేవదీశాడు. కవిత్వం, ఈ ప్రపంచంలో డబ్బుగా అవతరించిన స్వార్థ సూత్రం – ఈ రెండూ దేవుడూ దయ్యమూను.

షెలీ కవిత్వంలో ఏమి చెప్పాడో దానినే ఆచరణలో పెట్టాడు. అతడి కవిత్వాన్ని వివిధ రీతులలో అర్థం చేసుకోవచ్చు. కాని అట్టడుగున మాత్రం అతడి కవిత్వం, అతడనుకొన్నట్లే నైతికమూ, రాజకీయమూ. ఆంగ్ల కవులందరిలోకి బాగా రాజకీయ వాసనలున్నవాడు షెలీ. అతడి రచనలన్నీ ఏదో సామాజిక చర్యను చేపట్టాలని సందేశాలిచ్చేవే. ఉదాహరణకు అతడి సుదీర్ఘమైన ''ఇస్లాం విప్లవం'' (The Revolt of Islam) ( దాదాపు 500 పంక్తులు) అణచివేతకు వ్యతిరేకంగా స్వేచ్ఛను గురించి చెప్పింది. మానవాళి స్వేచ్ఛా సమతలు అతడి దృష్టిలో బౌద్ధిక సౌందర్యం. దీనిని మనస్సులో ఉంచుకొని రాసిన A Hymn to Intellectual Beauty ఈ ప్రపంచంలోని దుఃఖం (evil) మీద బౌద్ధిక సౌందర్యం విజయాన్ని కీర్తించింది. ఈ భూమిమీద ఆదర్శ రాజ్యానికి చేసే పయన్నాన్ని ప్రతీకీకరించిన పురాణ పురుషుని విజయవంత మైన విప్లవాన్ని "Prometheus Unbound" చెబుతుంది. "Ode to the West Wind" లో తన రాజనీతి సందేశాన్ని వ్యాపింపజేయమని, ''నా మృత ఆలోచనలను విశ్వం మీదకు పంపండి'', 'ఆవిధంగా నూతన జన్మ త్వరగా వస్తుంది', 'నా మాటలను మానవాళి మీద వెదజల్లండి' అని చెప్పాడు. 'To Skylark' లో గూడ, తన మాటలను సందేశాన్ని ప్రపంచానికి వినిపించడంలోని ఆటంకాలను కష్టాలను గురించి రాశాడు. అతడి జీవిత కాలంలో అతనికి లభించిన కొద్దిపాటి ప్రాచుర్యం అతడిని నిరుత్సాహపరిచింది. అతడు కవిత్వాన్ని ఎప్పుడూ తన స్వంత సంతృప్తి కోసం రాసుకోలేదు. ఇలా రాసిన కవులు చాల అరుదు.

మనిషిగా షెలీ ఏమిటి? మొన్న మొన్నటి వరకు అతడి రెండవ భార్య మేరీ ప్రచారం చేసిన అతడి వర్ణననే అందరూ అంగీకరించారు. ''చాల పరిశుద్ధుడు. అమాయకుడు. ఈలోకం పట్టనివాడు. మోసంగాని దుర్మార్గంగాని తెలియనివాడు. తన కళకు, తోటి మానవాళికి అంకితమైనవాడు. రాజకీయుడు కాడు. తెలివైనవాడు. సున్నిత మనస్కుడు''. నాకు తెలిసినంతలో షెలీ చాల మంచివాడు. స్వార్థం ఎరుగనివాడు. తన స్తోమతను మించి త్యాగం చేసినవాడు. ఇతరుల కోసం పరితపించినవాడు'', అని బైరన్ అన్నాడు. అయితే బైరన్ చేసిన ఈ వ్యాఖ్యలన్నీ షెలీ విషాదపూరిత అంతిమ దశలో ఉన్నప్పుడు చేశాడని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. అంతేకాదు షెలీ బైరన్‌తో చెప్పిన విషయాల మీద ఆధారపడి బైరన్ ఈ వ్యాఖ్యలను చేశాడు.

కాని వాస్తవం ఇంతకంటె భిన్నంగా వుంది. ఈ అభిప్రాయానికి రావడానికి మూలం ఆయన ఉత్తరాలే. రూసో లాగా ఇతడూ మానవాళిని ప్రేమించాడు. కాని వ్యక్తులను ప్రేమించలేదు. అతడి ప్రేమ ఒక అమూర్త జ్వాల. మూర్త మానవులు దగ్గరకు వచ్చినప్పుడు వారు మసైపోయేవారు.

1792 ఆగస్టు 4వ తేదీన సెసెక్స్‌లో కులీన వంశంలో జన్మించాడు షెలీ. ఇతడికి నలుగురు చెల్లెళ్ళు. తల్లి, తండ్రి. చెల్లెళ్ళకు అతడొక మహారాజు. మొదటి నుంచీ అతడికి ప్రకృతి అంటే ఇష్టం. రసాయనిక పదార్థాలు, బెలూన్లతో ప్రయోగాలు చేసేవాడు. పన్నెండవ యేట ఈటన్‌కు పంపించారు. అక్కడ గ్రీకు, లాటిన్, ప్రాచీన సాహిత్యాల అభ్యాసనం చేశాడు. అద్భుతమైన బాలుడుగా ప్రకాశించాడు.

1776 ఆడమ్ విష్‌హాప్ట్ (Adam Weishaupt) ఇల్యుమినాటి (Illuminati) రహస్య సంఘాన్ని స్థాపించాడు. ఇందులో సభ్యులు ''జ్ఞానదీప్తి'కి ప్రతీకలని భావిస్తారు. దీని లక్ష్యం ఏమంటే, ''ఈ భూమిమీద అహింసాయుతంగా రాకొమరితలు, రాకుమారులు అంతరించి, మానవజాతి అంతా ఒకే కుటుంబంగా తయారై, హేతువాదులయ్యే వరకు ఈ ప్రపంచానికి వెలుగునివ్వడం''. దీనిని షెలీ పూర్తిగా విశ్వసించాడు. దీనితోపాటు దీని వ్యతిరేకులు చెప్పిందాన్ని గూడ కలగాపులగంగా స్వీకరించాడు.

మొట్టమొదట అతడు రాజకీయంగా చేసిన పని, జ్ఞానోదయం అయిన, నిష్పక్షపాతులైన వారితో ఒక రహస్య సంఘాన్ని స్థాపించాలని లై హంటుకు సూచించడం. అతడు బడి చదువులో ఉండగానే 'ఈటన్ నాస్తికుడు'గా పేరు మోసాడు. తండ్రి, తాతలు అతడు రాసిన పద్యాలకు గ్రంథ రూపం పొందడానికి సహాయం పడ్డారు. వీళ్ళు ఈ పని ఎందుకు చేశారంటే, షెలీ మత వ్యతిరేక భావనలను పైకి వ్యక్తీకరించకుండా ఉండాలనే షరతు మీద. దీనికి షెలీ ఒప్పుకొన్నాడు. కాని తరవాత దీనిని పాలించలేదు. మార్చి 1811లో ఆక్స్‌ఫర్డ్ మొదటి సంవత్సరంలో ఉండగా, తన మత వ్యతిరేక భావనలు పైకి చెప్పాడు. ఇందులో అతడి స్వంతం ఏమీ లేదు. జాన్‌లాక్, డేవిడ్ హ్యూమ్‌లు చెప్పినవే. ''భావాలు జ్ఞానేంద్రియాల నుంచి వస్తాయి కనుక, దేవుడు జ్ఞానేంద్రియాల ముద్రల నుంచి లభించడు కనుక, విశ్వాసం ఐచ్ఛికం కాదు కనుక, అవిశ్వాసం నేరం కాదు''. దీనికి అతడు ''నాస్తికత ఆవశ్యకత'' అని పేరు పెట్టాడు. దీనిని బిషప్‌లందరికి, అన్ని కళాశాలలకు రెచ్చగొట్టే ఉద్దేశంతో పంపించాడు. ఫలితంగా అతన్ని ఆక్స్‌ఫర్డ్ నుంచి పంపించి వేశారు. అతనిని కనీసం పెద్దవాడయ్యే వరకైనా ఆ భావాలను పైకి చెప్పవద్దని తండ్రి భంగపడ్డాడు. విలపించాడు, అరిచాడు, కోప్పడ్డాడు. షెల్లీ అప్పుడు పెద్ద విలన్‌లా, దయ్యంలా, పకపక నవ్వుతూ వెల్లకిలా నేలమీద పడిపోయాడు. ''కుటుంబ ప్రశాంతి కంటె, తనకు తన భావాలే ముఖ్యం'' అన్నాడు షెలీ. తలిదండ్రులకు తెలియకుండానే తన సోదరి ఎలిజబెత్ సహాధ్యాయిని అయిన పదహారేళ్ళ హారియట్ వెస్ట్ బ్రూక్‌ను వివాహం చేసుకొని (ఆగష్టు 1811) ఒక బాంబు పేల్చాడు.

దీనితో అతడికి కుటుంబంతో సంబంధాలు చెడినాయి. స్నేహితుడికి రాసిన ఒక ఉత్తరంలో, తన కుటుంబం అంతా స్వార్థపరుల కూపమని, వారికి తినడం, త్రాగడం, నిద్రపోవడం కంటే వేరే ఏమీ పని లేదని రాశాడు. ఒక్కోసారి తండ్రిని మంచి చేసుకోవడానికి మంచిగా ఉత్తరాలు రాసేవాడు. కొన్నిసార్లు తిడుతూ రాసేవాడు. ఒకసారి తండ్రిమీద కోపంతో, ''నాకు దొరికే మొదటి అవకాశాన్ని నిన్ను చూడడానికి ఉపయోగిస్తాను. నాకు డబ్బు ఉంటే నిన్ను అప్పుడే లండన్ హోటల్లో కలిసి నీ చెవిలో బిషి, బిషి, బిషి, హేయ్ బిషి, బిషి అని జోరీగలాగ నీకు చెవుడు వచ్చేవరకు గీపెట్టేవాణ్ణి''.

అక్టోబరు 22న అతడు తల్లికి రాసిన ఉత్తరం మరీ ఘోరంగా ఉంది. గ్రహామ్‌తో 'వ్యవహారం' నడుపుతున్నావూ. అది కప్పి పెట్టుకోవడానికే నా చెల్లి ఎలిజబెత్ పెళ్ళి అతనితో ఏర్పాటు చేస్తున్నావు'' అని రాశాడు. ఇదే ఉత్తరాన్ని అందరికి బహిరంగ పరచవలసిందని చెల్లి ఎలిజబెత్‌కు రాశాడు. కాని ఈ ఉత్తరంలోని ఆరోపణలు నిజమనడానికి ఆధారాలేమీ లేవు.

తన సోదరీమణులైన హెలెన్, మేరీలను తలిదండ్రుల వద్ద లభించే పశు జీవితం నుంచి విముక్తం చేయాలనుకొన్నాడు. షెలీ గోడ్విన్‌సర్కిల్లో సభ్యుడయ్యాడు. అతడి ''విముక్త'' కూతురుతో స్నేహం చేశాడు. ఈమె తల్లి మహిళా స్వేచ్ఛ ఉద్యమ నాయకురాలు. ఆ సర్కిల్ లో లభించే మగవాళ్ళను ఉమ్మడిగా పంచుకొనే (కనీసం సైద్ధాంతికంగా) యువస్త్రీల మధ్య తన వయోజన జీవితాన్ని గడిపాడు. 'అగమ్య గమనం' అంటే బైరన్ లాగ పెద్ద పట్టింపు లేదు షెలీకి. బైరన్ తన అర్ధసోదరి (Half Sister) ఆగస్టాలె (Angusta Leigh) తో ప్రేమ నడిపాడు. "The Revolt of Islam" లో షెలీ ప్రవేశపెట్టిన నాయకులు సోదరీ సోదరులు అయితే పబ్లిషరు షెలీపై ఒత్తిడి తెచ్చి మార్పించాడు.

అతడి భార్య హారియట్ మధ్య తరగతికి చెందిన అందమైన పిల్ల; వ్యాపారి కూతురు. షెలీతో తల మునకల ప్రేమలోపడి అతడితో పలాయనం చేసింది. అక్కడ నుంచి ఆమెకు కష్టాలు ఆరంభమయ్యాయి. అతడి జీవితంలో స్థిరత్వం లోపించడం, అప్పుల బాధలు, చట్ట వ్యతిరేకమైన అతడి పనులు, అపాయకరమైన రసాయనిక ప్రయోగాలతో ఇరుగు పొరుగును చెడు చేసుకోవడం - అన్ని కలిసి ఆమెకు మనశ్శాంతి లేకుండా చేశాయి. అయినా ఆమె అతడి పనులలో హృదయ పూర్వకంగానే పాల్గొంది. అతడు రాసిన సుదీర్ఘమైన పద్యం "Queen Mab" ఆమెకు అంకితమిచ్చినప్పుడు ఆమె ఎంతో సంతోషించింది. ఒక కొడుకు చార్లెస్‌ను, ఒక కూతురు ఎలిజాను అతనికి కన్నది.

ఏ భార్య ఏ భర్తను ఎల్లకాలం ఆకర్షించలేదు. షెలీ ప్రేమ లోతైనది, గాఢమైందీ, మోహపూరితమైందీను. అయితే ఉన్నలోపం అల్లా అది ఎప్పుడూ ఒకే వస్తువుమీదే నిలవదు. జూలై 1814లో తాను గోడ్విన్ కూతురు మేరీతో ప్రేమలో పడ్డానని భార్యకు చెప్పాడు. ఆమెతో ఐరోపా ఖండం పర్యటనకు వెళ్ళిపోయాడు. ఆ తరవాత అతడు తన భార్యకు రాసిన ఉత్తరాలన్నీ తండ్రికి రాసిన ఉత్తరాల ఫక్కీలోనే ఉన్నాయి. కాసేపు బుజ్జగిస్తూ, కాసేపు తిడుతూ నడిచాయి ఆ ఉత్తరాలు.

1814 నవంబరు 30న పుట్టిన అతడి పుత్రుణ్ణి అతడు ఎప్పుడైనా చూశాడా? అనేది సందేహం. అయితే అతడు రూసో మాదిరి పిల్లలను ఆటంకంగా పరిగణించలేదు. పై పెచ్చు పిల్లల కోసం న్యాయ స్థానాన్ని ఆశ్రయించాడు. అతడు ఓడిపోయాడు. పిల్లల్ని పెంచమని హారియట్ తన సోదరిని కోరింది.

నవంబరు 9న ఆమె అంతర్ధానమైంది. డిసెంబరు 10న ఆమె శవమై హైడ్ పార్క్‌లో కనిపించింది. దీనికి షెలీ ప్రతిస్పందించిన తీరు ఘోరంగా ఉంది. అతడు మేరీకి రాసిన ఉత్తరంలో ఇలా ఉంది. ''పాపం ఆ దిక్కుమాలిన ఆడది... ఆమెను తల్లిదండ్రులు వెళ్ళగొట్టారు. వేశ్యా వాటికలో అడుగుపెట్టింది. స్మిత్ అనే వాడితో వ్యవహారం నడిపించింది. వాడు వదిలి వేసే సరికి ఆత్మహత్య చేసుకొంది. పాములాంటి ఆమె సోదరి, ఈమెను చంపడం ద్వారా ఆ ముసలి వాడి ఆస్తిని పొందింది... అందరూ నాకు చేయవలసిందంతా చేశారు. ఆమె యెడ నేను ఎంతటి ఋజువర్తనను, ఉదారతను ప్రదర్శించానో అందరికీ తెలుసు''

షెలీ మరో ఆత్మహత్యకు గూడ కారకుడయ్యాడు. అయినా అతడు చలించలేదు. గోడ్విన్ భార్య మొదటి సంబంధానికి పుట్టిన ఫానీ ఇమ్‌లీ ఒకనాడు 1814 సెప్టెంబరు 10 - 14 మధ్య సాయంత్రం అతడిని కలిసింది. (ఈమె అతడిని ప్రేమించిందని గోడ్విన్ అతని భార్య భావించారు.) అప్పుడామెను విమోహితను చేశాడు. 9 అక్టోబరు నాడు అతడు, మేరీ క్లారేలు ముగ్గురూ ఫానీ నుంచి ఒక ఉత్తరం అందుకొన్నారు. ఆమె ఎంతగానో కుంగిపోయి రాసిన ఉత్తరం. ఆమె కోసం, ఆ ఉత్తరం చూసిన తక్షణం, షెలీ ఆమెను కలవాలని వెళ్ళాడు కాని ఆమె అక్కడ లేదు. అంతకు ముందే ఆమె స్వాన్‌సికి వెళ్ళింది. ఆ తరవాత రోజు నిద్రమాత్రలు అతిగా సేవించి జీవితం చాలించింది. ఆమెను గురించి షెలీ ఎప్పుడూ తన ఉత్తరాలలో పేర్కొనలేదు.

అలాగే షెలీ భావాల బలిపీఠం ముందు ఎంతో మంది హతులయ్యారు. ఎలిజబెత్ మీచ్‌నర్ అనే బడిపంతులమ్మకు అదే గతి పట్టింది. ఈమె సమూలపరివర్తనవాది. తన భావాల కరపత్రాల పంపిణీకి బాగా పనికి వస్తుందని ఆమెతో షెలీ ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపి, ఒకసారి ఆమెకు చెక్క పెట్టె నిండా తన విప్లవ సాహిత్యాన్ని నింపి, పోస్టేజిని కొంతవరకే కట్టిపంపాడు. మిగతాది ఆమెకు చేరిన తరవాత ఆమె కడుతుందనే ఉద్దేశంతో అలా చేశాడు. ఈ కారణంగా అది అధికారుల దృష్టిలో పడి, ఆమె ఉద్యోగం ఊడింది. అప్పుడు షెలీ ఆమెను తన సంఘంలో చేరమని పిలిచాడు. ఆమెను ఎంతగానో మెచ్చుకొన్నాడు. అయితే హారియట్‌కూ ఆమె సోదరికీ మొదట్లో ఆమె అంటే ఇష్టం ఉన్నా తరవాత వారికి అసహ్యం వేసింది. ఒకనాడు సముద్రతీరాన వాహ్యాళిలో అతడు ఆమెను విమోహితను చేశాడు. తరవాత అతడికీ ఆమె అంటే జుగుప్స కలిగింది. ఆమెను తిరిగి పంపి వేశాడు. ఆ తరవాత ఆమెను బ్రౌన్ దయ్యం అన్నాడు. ఆమె దగ్గర తీసుకొన్న 100 పౌనులు అప్పు తీర్చలేదు. ఆ విధంగా ఆమె షెలీ జ్వాలకు సమిధ అయింది.

అలాగే డాన్ హాలే అనే పదిహేను సంవత్సరాల బాలుణ్ణి గూడ కరపత్రాలు పంచడానికి, గోడల మీద పోస్టర్లు అంటించడానికి కుదుర్చుకొన్నాడు. అతడిని పట్టుకొని అధికారులు 200 పౌనులు జరిమానా వేశారు. ఆ జరిమానాను షెలీ చెల్లిస్తాడని అందరూ ఆశించారు. కాని అది జరగలేదు. తరవాత జైలు నుంచి తిరిగి వచ్చిన అతనిని ఆరు నెలలు ఉంచుకొని, అతనికి జీతం పూర్తిగా ఇవ్వకుండానే పంపివేశాడు. ఆ విధంగా ఈ సమిధ అంధకారంలోకి వెళ్ళిపోయింది.

ఇవన్నీ జరిగినప్పుడు అతడు చాలా చిన్నవాడు అని ఎవరైనా వాదించవచ్చు. నిజమే అతని వయస్సు 1812లో 20 ఏళ్ళు మాత్రమే. హారియట్‌ను వదిలివేసింది 22వ యేట. ఆ మాటకువస్తే ఆంగ్ల సాహిత్యాన్ని మార్చిన కవులందరూ పిన్న వయస్కులే. కీట్స్ చనిపోయే నాటికి వయస్సు 25. షెలీ తన 29వ యేట. మరణించాడు. బైరన్ వయస్సు

36. ఒక అర్థంలో వీరంతా పిల్లలే అయినా, ప్రపంచంలో అప్పుడున్న విలువలను మార్చి తమ విలువలను ప్రతిపాదించిన మేధావులు. ఈ విషయంలో వారిని చిన్నవారని భావించలేము.

తరవాత అతని ఆర్థిక వ్యవహారాలు అంతే. అందిన చోటెల్ల అప్పు చేశాడు. మళ్ళీ తీర్చేపని లేదు. ఎప్పుడూ హడావుడిగా బయలుదేరడం. చుట్టుప్రక్కల వాళ్ళ అప్పులు అలాగే మిగిలిపోవడం. ఆ విధంగా అంతా శత్రువులుగా మారడం జరిగింది. ఆడవాళ్ళ దగ్గర-చాకలి, పనిమనిషి, ఇల్లు గల ఆవిడవద్ద - అప్పు చెయ్యడానికి వెనకాడ లేదు. ఇటాలియన్ స్నేహితురాలు దగ్గర 220 క్రౌన్లు అప్పు చేశాడు. ప్రతి వ్యాపారస్తునికి బాకీయే.

ఆయన పద్యాలను అచ్చు వేసిన వారికి, అమ్మిపెట్టిన వారికి అందరికీ బాకీయే. స్లాటర్ అనే ఆక్స్‌ఫర్డ్ పుస్తక విక్రేత వద్ద 20 పౌనులు అప్పు చేశాడు. షెలీ యూదు వడ్డీ వ్యాపారుల చేతుల్లో పడగూడదనే అతడు సహాయం చేశాడు. 1831లో స్లాటర్ సోదరుడు షెలీ తండ్రి తిమోతికి ఒక ఉత్తరం రాశాడు. ''మీ పుత్రుడు వడ్డీ వ్యాపారుల అధిక వడ్డీల బారిన పడకుండా తప్పించాలనే సదుద్దేశంతో మేము 1300 పౌనులు పోగొట్టుకొన్నాము''.

ఏది ఏమైనా అతడు మహాకవి. ప్రపంచాన్ని పరివర్తనం కావించేది కవితావేశం, లేదా బౌద్ధిక సౌందర్యం. ఈ లక్షణం కవులకు ఎక్కువగా ఉంటుంది. అందుకే అతడు కవులను అనధికార సహజ శాసనకర్తలుగా అభివర్ణించాడు. కవుల్లోకి మహాకవి అతడు. ఒకరేమిటి అన్ని వర్గాల వారి - దళితులు, ఫ్యాక్టరీ కూలీలు, దొంగలు, దొరలు అందరి - ఊహాత్మక సహానుభూతి **(imaginative Sympathy)** కి అతడు పాత్రుడయ్యాడు. తనకు వరంగా లభించిన కవితాశక్తితో అతడు రాజకీయ ప్రగతికి కృషిచేశాడు. సమాజం - సమూలంగా వ్యవస్థిత మత నాశంతో సహా - పూర్తిగా పరివర్తితం కావాలని ఆశించాడు.

షెలీ, విలియమ్స్ లివిరానో నుంచి లెరిసికి బోట్‌లో 8 జూలై 1822 అననుకూల వాతావరణ పరిస్థితులలో వస్తున్నారు. సాయంత్రం 6-30 గంటలకు పెనుతుఫాను. మరో బోటు కెప్టెన్ వీరిని తన బోటు మీదికి రావలసిందిగా కేక వేశాడు. కాని షెలీ, ''రాము'' అని తిరిగి ఆ పెనుగాలిలోనే అరిచాడు. అలాగే ఆ డాన్‌జాన్ అనే బోటు మునిగిపోయింది.

మెరీ చిన్నారి పెర్సీ (జమీందారికి వారసుడు, చార్లెస్ చనిపోయాడు) ఇంగ్లాండు వచ్చింది. షెలీ జ్ఞాపకార్థం ఒక చిహ్నాన్ని నిర్మించాలని తలపోసింది. అయినా ఆవిడ హృదయ ఫలకం మీద పడిన గాయపు మచ్చలు కెలకవేస్తూనే ఉన్నాయి. పెర్సీ చదవడం, రాయడం నేర్చుకొంటున్నప్పుడు చూసిన ఒక స్నేహితుడు, ''తప్పకుండా ఇతడు అసాధారణ వ్యక్తి అవుతాడు'' అన్నాడు. వెంటనే మేరీషెలీ అంది. ''పాపం శమించుగాక. అతడు మామూలు మనిషిగా పెరగాలని ఆశిస్తాను''.

# కావ్యానందం - రసం

-డా. భీమసేన్ నిర్మల్

రసగంగాధర కర్త అయిన జగన్నాథ పండితరాయలు ఆనందం మూడు రకాలైనదని చెప్పాడు.

**1. విషయానందం:** ఇది లౌకిక సుఖంతో కూడినది. అంటే అంతఃకరణ వృత్తులకు విషయ సాంగత్యం వలన లభించే సుఖం. దీనిని స్థూలంగా ఇంద్రియసుఖం అని కూడా చెప్పుకోవచ్చు. ఆయా ప్రవృత్తులచే, ఆయా ఇంద్రియాలకి సుఖం కలుగుతుంది- అన్న విషయం అందరికీ తెలిసినదే. ఇది కేవలం క్షణికమైనది, అశాశ్వతమైనది.

**2. ఆత్మానందం:** ఇది విశుద్ధమైన బ్రహ్మానందం. అంటే పరమాత్మతో తాదాత్మ్యం కలిగినపుడు ఆత్మకు కలిగే శాశ్వతమైన ఆనందం. అయితే ఇది పరమయోగులకు తప్ప ఇతరులకు సాధ్యపడేదికాదు.

**3. కావ్యానందం:** ఇదే కావ్యపఠనాదులవల్ల లభించే రసానందం. ఇది బ్రహ్మానంద సహోదరం. అంటే దానితో సమానమైనది. కాని బ్రహ్మానందం కాదు. కావ్య పఠనం చేత, రూపకాదులను చూడటం వలన మనస్సుకు కలిగే నిరుపాధికమైన (ఏ ఒక్క వ్యక్తికీ సంబంధించినది కాదు), దేశకాలావధులకు అతీతమైన యీ ఆనందమే 'రసం' అని లాక్షణికులు అందరూ అంగీకరించారు.

కావ్యానందానికీ - బ్రహ్మానందానికీ భేదమున్నది. రెండూ ఆత్మకు సంబంధించినవే అయితే ఈ భేదం స్వభావంలో కాక, గుణంలో ఉన్నది. కావ్యానందంలో తొమ్మిది రకాలయిన స్థాయిభావాల భూమిక ఉంటుంది. కనుక అది సోపాధికమయినది. అంటే ఉపాధి (ఆధారం) లేకపోతే ఈ ఆనందానికి తావులేదు. కనుక ఇది స్థిరమైనది కాదు. బ్రహ్మానందం నిరుపాధిక మయినది. అంటే సాధారణ లౌకిక భావాలతో సంబంధం లేనిది. అందుచేత అది స్థిరమైనది, శాశ్వతమైనది.

విషయానందం కంటె కావ్యానందం ఎక్కువ శుద్ధమూ చిన్మయమూ అయినది. బ్రహ్మానందం ఎక్కువ సూక్ష్మమూ పరిష్కృతమూ అయినటువంటిది. కావ్యానందం చాలామటుకు స్థూలం - భౌతికం అయిన అంశాలతో కూడి ఉంటుంది. కావ్యాస్వాదమైన రసం ఆనంద మయం. అంటే రసం ఒక రకమైన ఆనంద చైతన్యం. ఈ ఆనందచేతనలో ఇంద్రియ భోగాదులకు దాదాపు స్థానం లేకపోవడంతో అది చైతన్య ఆత్మానందం.

లౌకికభావాలు కావ్య నిబద్ధాలైనపుడు తమ స్థూల ఇంద్రియ రూపాలను విడిచిపెట్టి, సూక్ష్మరూపాన్ని ధరిస్తాయి. అప్పుడు వ్యక్తిగత రాగద్వేషాల నుంచి విముక్తుడై, సహృద యుడు సాధారణీకృతాలైన ఆ భావాల ద్వారా ఆత్మానందాన్ని పొందుతాడు. ఇది శుద్ధబ్రహ్మా నందం వలె శాశ్వతం కాదు. ఎందుకంటే ఇందులో లౌకిక విషయాలు బొత్తిగా నశించిపోవు. వాటి ఆధారంగానే లభించే ఆనందం కనుక లౌకిక తత్త్వాలమీద ఆధారపడి ఆత్మ ఆనందాన్ని పొందుతుంది. కనుకనే కావ్యానందాన్ని ''బ్రహ్మానంద సహోదర'' అన్నారు. అంటే శబ్దార్థాల ద్వారా విశుద్ధ భావభూమికలో ఆత్మచైతన్య ఆస్వాదమే, ఆనందమే రసం.

పాశ్చాత్యులు వాడిన - ''Pleasure'' అనే మాటకు లౌకికతత్త్వంతోటే ఎక్కువ సంబంధం కనిపిస్తుంది. అందుచేత అది దాదాపు భౌతికమైనది. భారతీయ లాక్షణికులు వాడిన ''ఆనంద'' ''ఆహ్లాద'' శబ్దాలకు ఆధ్యాత్మిక స్వరూపం ఉన్నది. పాశ్చాత్యులు చెప్పిన నిర్వచనాల దృష్ట్యా కావ్యానందం ప్రత్యక్షంగా ఇంద్రియ - మానసికానందమే. సంస్కృత కావ్య శాస్త్ర పండితుల నిర్వచనాల ప్రకారం కావ్యానందం ఆత్మానందం యొక్క మరో రూపమే. ఆధ్యాత్మవాదులయిన కొంతమంది పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయం కూడా ఇదే.

కావ్యానందం అన్నివిధాలయిన లౌకిక - ఆధ్యాత్మిక అనుభవాల కంటె భిన్నమయిన, ఒక రకమైన విలక్షణమయిన ఆనందం. ఈ విలక్షణమయిన అనుభూతిని ఆధ్యాత్మిక అనుభూతి అనుకోవడం అంత సముచితం కాదు. ఎందుకంటే ఈ విలక్షణమయిన అనుభూతి లౌకికానందం కంటే ఆధ్మాత్మికానందం కంటే కూడా విశిష్టమయినది. ఇది లౌకికమైన ఆనందం కంటే ఉచ్చస్థితికి చెందినది, బ్రహ్మానందకోటికి దాదాపు సమానమైనది.

ప్లేటో కావ్యానందాన్ని సాక్షాత్తు ఇంద్రియానందంగా పరిగణించాడు. కాని ఆయన అభిప్రాయం కావ్యసత్యం వేరు, వస్తుసత్యం వేరు - అనే సిద్ధాంతం మీద ఆధారపడింది. ప్రత్యక్షంగా ఇంద్రియానుభూతి లేదా లౌకికానుభవం కాకపోయినప్పటికీ కావ్యానందం లౌకిక జీవనానుభూతిమీద ఆధారపడిందే. ఎందుకంటే కావ్యానందాన్ని ఆస్వాదించే ఉపకరణాలు (సాధనాలు) అన్నీ - భావాలు, కల్పన, బుద్ధి మొదలైన తత్త్వాలు - లౌకికాలు. వాటిని ఆస్వాదించే సాధనాలైన కళ్ళు - చెవులు, మనస్సు - బుద్ధి కూడా లౌకికాలే. ఆస్వాదించే సామాజికుడూ (ప్రేక్షకుడు - పాఠకుడు) కూడా వాసనాయుక్తుడే. అంటే లౌకికమైన తత్త్వాలతో సంబంధం కలవాడే. అతడు భక్తుడు కాదు; యోగికాదు. అయితే లౌకిక - ఇంద్రియ మానసికానుభూతి అయిన కావ్యానందం భౌతికమైన పరిధులను దాటి, ఆధ్యాత్మిక లోకాల అంచులకు చేరటం వంటిది యీ కావ్యానందం.

ప్రత్యక్షంగా ప్రేమికుల కలయిక (రతిభావం)లో ఉన్న ఆనందంలోను, 'నా మనస్సు రతి భావానుభవంద్వారా ఆనందాన్ని ఆస్వాదిస్తుంది' అనడంలో తప్పకుండా భేదం ఉన్నది. జీవితంలోని రత్యనుభవం (ప్రేమానుభవం) ప్రత్యక్షమైనది, వ్యక్తిగత రాగద్వేషాలతో కూడు కొన్నది. కావ్యంలో నిబద్ధమైన రతియొక్క (శృంగార రసం యొక్క) అనుభవం ప్రత్యక్ష ఇంద్రియానుభూతివల్ల కలిగే మానసికానుభవం కాదు, వ్యక్తిగత రాగద్వేషాలతో కూడుకొన్నది కాదు.

కావ్యభాష యొక్క కల్పనాత్మక తత్త్వాల (లక్షణ - వ్యంజన) ప్రభావంవల్ల పాఠకుడి కల్పన క్రియాశీలమవుతుంది. భాషకుకల అభిధార్థ బంధాలు తొలగిపోవటంతో సహృదయుడి స్థాయిని బట్టి రకరకాల సంస్కార చిత్రాలు ముందుకు వస్తాయి. వేరు వేరు సంచారీ భావాలతో పరివృతమైన స్థాయిభావాలు జాగృతమవుతాయి. ఏ వ్యక్తిపట్ల ఉన్ముఖం కాని కారణం చేత అవి వ్యక్తిగత రాగద్వేషాల నుండి విముక్తమవుతాయి. చివరకు ఈ సంపూర్ణ అనుభవ ప్రక్రియ ఒక సుఖప్రదమైన అనుభూతిగా మారుతుంది. సుఖప్రదమైన ఈ అనుభూతి ప్రత్యక్ష రతిభావంలో ఉండే ఆనందం కాదు. పరోక్ష రతిభావం అంటే స్మృతి వలన కలిగే ఆనందం కూడా కాదు. ఎందుకంటే కల్పనాగత అనుభూతియే అయినా స్మృతి, వ్యక్తిగత రాగద్వేషా

లతో కూడుకొనే ఉంటుంది. కనుక అది కూడా సుఖ దుఃఖాత్మకమై ఉంటుంది. ఇది రతిభావ సఫల వివేచనల వల్ల కలిగే ఆనందం కాదు. ఎందుకంటే అసలిది బుద్ధి ప్రక్రియ కానే కాదు. నిజానికిది ఒక రకంగా సమంచితమైన ఆస్వాదం అంటే ఇంద్రియ, రాగాత్మక, బౌద్ధిక తత్త్వాల సంయోగం వలన జనించేది.

భావనానుభవం స్మృతి యొక్క ప్రత్యక్షానుభవం కాదు. దాని విశ్లేషణ బౌద్ధికానుభవం అసలేకాదు. అది స్మృతి యొక్క అనుభవం కంటే అధిక సూక్ష్మమూ, బౌద్ధికానుభవం కంటే అధిక స్థూలమూ అయి ఉంటుంది. ఈ విధంగా కావ్యం వల్ల లభించే సంవేదనల స్థితి ప్రత్యక్ష మానసిక సంవేదనల కంటే సూక్ష్మతరమూ, బౌద్ధిక సంవేదనల కంటె ఎక్కువ ప్రత్యక్షమూ, స్థూలమూ అయిఉంటుంది. అందువల్లనే కావ్యానుభూతిలో (కావ్యానందంలో) ఇంద్రియానుభూతి యొక్క స్థూలత్వమూ, తీవ్రతా (ఇంద్రియ సంబంధమైన తీవ్ర ఉద్వేగాలు) ఉండవు. బౌద్ధికానుభూతియొక్క అరూపత్వమూ ఉండదు. అందువల్లనే కావ్యానందం లౌకికానందం కంటె శుద్ధ పరిష్కృతమూ, బ్రహ్మానందం కంటె సరసమూ అయి ఉంటుంది. ఇంకా వివరించి చెప్పాలంటె కావ్యానందం లౌకికానందం వలె క్షణికమూ, అస్థిరమూ కాదు. బ్రహ్మానందం వలె లౌకికానుభూతులతో సంబంధం లేనిదీ అయిఉండదు. కనుక ఇది లౌకిక విషయవాంఛలలో మునిగి తేలియాడే సామాన్యుడి ప్రవృత్తిని ఉదాత్తం (Sublime) చేయగలిగే సామర్థ్యం కలిగి ఉంటుంది.

(ఆచార్య నగేంద్ర రచించిన 'రససిద్ధాంతం' ఆధారంగా)

# మేధావుల సహకారం కావాలి

**20వ** శతాబ్దంలో భౌతికశాస్త్ర ప్రపంచంలో రెండు సిద్ధాంతాలు తలమానికంగా తలెత్తాయి - అవి సాపేక్ష సిద్ధాంతాలు (థియరీ ఆఫ్ రిలెటివిటీ), మరొకటి క్వాంటమ్ థియరీ (పరిమాణతా ప్రమాణ సూత్రం). మన భౌతిక ప్రపంచంపై యీ గంభీరమైన భావనలు సూత్రాలుగా అవతరించాయి. ఈ భౌతిక ప్రపంచాన్ని (విశ్వం) విశదీకరించడంలో క్వాంటం మెకానిక్స్ అసాధారణ విజయం సాధించింది. క్వాంటం థియరీ గణనీయమైన విజయాన్ని సాధించినప్పటికీ కొన్ని ప్రాథమిక తాత్త్విక సమస్యలు దీన్ని వ్యక్తీకరించడంలో దీని ప్రభావాన్ని చెప్పడంలో తలెత్తుతున్నాయి. అవి యీక్రింది ప్రశ్నల రూపంలో మిసిమి పాఠకుల సౌకర్యంకోసం పొందుపరుస్తున్నాము. తగిన రచనలు కావాలి ప్రచురణార్థం.

A. How the self, though 'divided', Yet experiences an underlying Identity?

B. How the self is at once a constituent of this universe and yet distinct?

C. How the self linked to every other entity in the universe is useful and Creative?

D. What Constituets Consciousness can the mind (of Consiousness) in the Universe?

– మిసిమి సంపాదకుడు



భారత ప్రజను పీక్కు తింటున్న సంస్థానాధీశ జాగిలాలు
- బేరసారాల్లో బ్రిటిష్ పెత్తందార్లు.

– చిత్త ప్రసాద్